# సమయం - సందర్భం

1 నవంబర్ 2007న హోలియ పట్టణంలో తొలిసారిగా సీమాంధ్రుల సంఘీభావ సదస్సు జరిగింది. తెలంగాణా ఉద్యమంలో ఇది చారిత్రాత్మక సదస్సు. రెఫరెండం సర్పంచ్‌గా అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన వేనేపల్లి పాండురంగారావు నేతృత్వంలో 'తెలంగాణ మట్టిమనుషుల' సారథ్యంలో 'సీమాంధ్రుల తెలంగానం' పేరుతో ప్రతిష్ఠాత్మకంగా జరిగిన ఈ సదస్సు సామాజికోద్యమాల చరిత్రలో మరో మలుపుగా పేర్కొనవచ్చు. సీమాంధ్ర కవులు, కళాకారులు, రచయితలు, కార్యకర్తలు ఈ సదస్సులో పాల్గొని "అన్నదమ్ముల్లా విడిపోదాం ఆత్మీయుల్లా కలిసుందాం" అని పిలుపునిచ్చారు. తమ తమ ప్రాంతాల వెనుకబాటు తనాన్ని ప్రస్తావిస్తూ తెలంగాణా రాష్ట్ర సాధనకు మద్దతు పలికారు. ఈ సందర్భంగానే సంఘీభావ కవిత్వం వెలువరించాలని నిర్ణయం తీసుకోవడం జరిగింది.

2008 జనవరి 7న అన్ని ప్రధాన దినపత్రికల్లో ఈ సంకలనానికి సంబంధించిన ప్రకటన వెలువడింది. సీమాంధ్ర కవులు వెంటనే స్పందించి తమ కవితల్ని పంపించినప్పటికీ, సంకలనం తీసుకురావడం కొన్ని సాంకేతిక కారణాల వలన ఆలశ్యమయింది.

ఈ కవితా సంకలనంలో అభ్యుదయ, విప్లవ, దళిత, ముస్లిం, స్త్రీవాదాలకు చెందిన సీమాంధ్ర కవులు (రాయలసీమ, కోస్తా, ఉత్తరాంధ్ర) బేషరతుగా తెలంగాణా రాష్ట్ర సాధనకు సంఘీభావం తెలియజేస్తున్నారు. సుదీర్ఘమైన తెలంగాణ ఉద్యమ ప్రస్థానంలోనే కాకుండా ఆధునిక తెలుగు సాహిత్యంలోనూ "కావడి కుండలు" కవితా సంకలనం విలక్షణమైనది, విశిష్టమైనది.

ఈ ప్రయత్నంలో మాకు సహకరించిన కవులు, రచయితలకు, కళాకారులకు, తెలంగాణా దోస్తులకు, సీమాంధ్ర స్నేహితులకు ధన్యవాదములు. అడిగిన వెంటనే ముఖచిత్రం వేసి ఇచ్చిన ప్రముఖ కార్టూనిస్టు మోహన్ గారికి, డిటిపి చేసిన శ్రీమతి పుష్పరాణి గారికి, సంకలనాన్ని అందంగా తెచ్చిన జుగాష్‌విలి గారికి కృతజ్ఞతలు.

*సంపాదకవర్గం*





# అన్నదమ్ముల్లా విడిపోదాం - ఆత్మీయుల్లా కలిసుందాం

***"రచయిత, ప్రజలకు సంబంధించిన ప్రతి సమస్యపైన తన అభిప్రాయం చెప్పాలి. అది మనకు సంబంధించింది కాదు, మనకెందుకులే అనుకోవడం పిరికితనం. దేశం గడ్డు సమస్యల కత్తెర్లెకు లోనైనప్పుడు రచయిత మౌనం గాని, ఉదాసీనతగాని ప్రజాద్రోహం కన్నా తక్కువేమీ కాదు"***

*(సృజన - సంపాదకీయం, మే 1971).*

మాట్లాడాల్సిన చారిత్రక సందర్భంలో కవి మౌనం పాటించడం ప్రజాద్రోహం. సమకాలీన ఉద్యమాల స్వరూపస్వభావాలను ప్రజాస్వామ్య స్ఫూర్తితో అర్థం చేసుకొని సమ్యక్ దృష్టితో వ్యాఖ్యానించడం కవి నిరంతర కర్తవ్యం. మనిషి ఆరోగ్య సంరక్షణకు వైద్యుడు మార్గదర్శకత్వం వహించినట్లు ఉద్యమ విజయసాధనకు కవి దిశానిర్దేశం చేయాలి. సామాజిక ఉద్యమ గమనానికి కవి సాంస్కృతిక రహదారిగా భాసించాలి. ప్రజా పోరాటానికి తలలోని నాలుకలా భాషించాలి. నాలుగు దశాబ్దాలుగా సాగుతున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో కవులు, రచయితలు, కళాకారులు అత్యంత కీలకమైన పాత్రను పోషించి ఉద్యమ లక్ష్యాలను విస్తృతంగా ప్రచారం చేశారు. ప్రత్యేకవాదం అనేకరకాల ఆటుపోట్లకు, రాజకీయ వెన్నుపోట్లకు గురైనప్పుడల్లా తెలంగాణ కవులు, రచయితలు ఉద్యమానికి 'పెన్ను'దన్నుగా నిలిచారు. వీరందించిన సిరాచుక్కల చైతన్యం కోట్లాది హృదయాలను కదిలించి కొడిగట్టి పోతున్న ఆకాంక్షలకు కొత్త ఊపిరిపోసింది. తెలంగాణ కళాకారుల 'పాటల కష్టం' వల్ల ప్రత్యేక రాష్ట్ర నినాదం గల్లీ నుండి ఢిల్లీ దాకా ప్రతిధ్వనించింది. కవులు కళాకారులు నిర్మించిన సాంస్కృతికోద్యమ విద్యుత్‌కాంతిని విశ్వవిద్యాలయాల విద్యార్థులు తమ అసమాన కృషితో తెలంగాణ ప్రజల గుండె గుండెలో ప్రసరింపచేశారు.

వీర తెలంగాణ పోరాటబాటలోకి ఆంధ్రప్రాంత కవులు, నాయకులు 'మేము సైతం' అంటూ కదలివచ్చిన ముచ్చట చరిత్ర ఎప్పటికీ మరచిపోదు. కృష్ణా జిల్లాకు చెందిన శేషాద్రిరమణ కవులు తెలంగాణాలో స్థిరపడి, ఈ ప్రాంత ప్రాచీన సాహిత్య పరిశోధనకు ఎంతగానో పరిశ్రమించారు. "నిజాం రాష్ట్రంలో ఆంధ్రకవులుపూజ్యము" అన్న ముడుంబ రాఘవాచార్యుల సృజనాత్మక దురహంకారాన్ని, ప్రాంతీయ దురభిమానాన్ని ఖండించిన శేషాద్రి రమణ కవులు గోలకొండ కవుల సంచికను వెలువరించటంలో సురవరం ప్రతాపరెడ్డికి చేదోడువాదోడుగా నిలిచారు. "భళిరే! నైజాము రాష్ట్రాంధ్రులారా! విఖ్యాత సమత్వ దృఙ్మహితులారా!" అంటూ జాషువా తెలంగాణా ప్రజల్ని ఆత్మీయంగా పలకరించాడు.

*"తెలగాణ తెలగాణ ధీరుల మొగసాల*
*తెలగాణ తెలగాణ విప్లవోజ్వల గాథ"*

అంటూ డా॥ ఆవంత్స సోమ సుందర్ తెలంగాణ రైతాంగ పోరాటానికి వజ్రాయుధాన్ని అందించాడు. ఆరుద్ర, బొల్లిమంత శివరామకృష్ణ, మహీధర, తుమ్మల వెంకటరామయ్య లాంటి అభ్యుదయ వాదులెందరో తెలంగాణా సాయుధ పోరాటం కేంద్రంగా రచనలు చేశారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఈ పోరాటంలో ఆయుధాల్ని కొనటానికి నిధుల్ని సమకూర్చటం కోసం గుంటూరు ప్రాంతం నుంచి ప్రజలు చందాలు వసూలు చేసి పంపించారని ఆచార్య యస్వీ సత్యనారాయణ తన "ఉద్యమ గీతాలు' గ్రంథంలో పేర్కొన్నారు.

1969లో ప్రారంభమయిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో గోదావరి ప్రాంతానికి చెందిన పదహారణాల ఆంధ్రుడు కొర్రపాటి పట్టాభిరామయ్య తొమ్మిది రోజుల పాటు నిరాహార దీక్ష చేశాడు. ఇదే సందర్భంలో సికింద్రాబాద్ నుండి ప్రారంభమైన ఊరేగింపుకు సర్దార్ గౌతులచ్చన్న నాయకత్వం వహించి ఉద్యమకారులకు బాసటగా నిలబడ్డాడు. యం.జి.రంగా లాంటి సుప్రసిద్ధ ఆంధ్ర రాజకీయనాయకులు ఆనాడే ప్రత్యేక రాష్ట్రాన్ని బాహాటంగానే బలపరిచారు. (చూడుము 'ప్రత్యేక తెలంగాణ ఉద్యమ చరిత్ర' – శోభాగాంధీ). చాలా కాలం పాటు 'సమైక్యవాది'గా చెలామణి అవుతూ ఎన్నో నీలాపనిందల్ని మూటగట్టుకున్న శ్రీశ్రీ కూడా ఆత్మవిమర్శ చేసుకుని "ఇంటిగ్రేషన్ను" బలపరుస్తూ రాయటం తప్పేనని అంగీకరించి (ఆత్మవిమర్శ : శ్రీశ్రీ ఉపన్యాసాలు : పేజి 247, విరసం ప్రచురణ 1990) తెలంగాణా బావుటాకు అరుణాంజలి చేశాడు.

తెలంగాణ బహుముఖీన ప్రాశస్త్యాన్ని ఈ సంకలనంలో సీమాంధ్రకవులు ఎంతో ఆప్యాయంగా కొనియాడుతున్నారు. తెలంగాణాను కన్నతల్లిగా ఆరాధిస్తూ,



వీరోచిత పోరాట వారసత్వాన్ని తనివితీరా గానం చేస్తున్నారు. "జిలుగు వెలుగుల తెలుగు జాబిల్లి"గా 'విప్లవాల మల్లి'గా, 'ప్రజాపోరులో పునీతమైన పుడమి' గా; 'సామ్యవాదానికి గుండెకాయ'గా 'వేలాది అమరత్వాలను పెనవేసుకున్న యోధ'గా 'చరిత్రలో పోరు కేతనాల విత్తనాలు నాటుకొని త్యాగాల పంటల్ని సంచులకెత్తిన వీరమాగాణం'గా "ఉద్యమాల్ని ప్రసవిస్తూ రాష్ట్ర సాధన కోసం తపిస్తున్న పచ్చి బాలింతరాలుగా తెలంగాణాను అభివర్ణించారీ కవులు.

*తెలంగాణా చరిత్ర కళ్ళముందు కదులుతున్నప్పుడు*
*పోరాట రూపాలెన్నో పాఠం చెప్పినట్టుగా వుంటుంది*
*(మంచికంటి – ప్రజా తెలంగాణా)*

అని తెలంగాణా పోరాట స్ఫూర్తిని చాటి చెబుతున్నారు.

తెలంగాణా భౌగోళిక సౌందర్యాన్ని, సాంస్కృతిక ఔన్నత్యాన్ని, చారిత్రక వైభవాన్ని వాస్తవిక దృష్టితో అక్షరీకరిస్తున్నారు. ప్రపంచీకరణ పడమటి గాలులకు వసివాడిపోతున్న తెలంగాణా పల్లె నిసర్గ సౌందర్యాన్ని దృశ్యమానం చేస్తున్నారీ కవులు. ఇలాంటి సదగాహనతో, లోకజ్ఞతతో, సృజనాత్మక బాధ్యతతో ప్రత్యేక తెలంగాణా వాదానికి సీమాంధ్ర కవులు మనసారా మద్దతు పలుకుతున్నారు.

'విశాఖ ఉక్కు' ఉద్యమం దగ్గర నుండి కారంచేడు, చుండూరు ఉద్యమాల వరకు ఆంధ్రా ప్రాంతంలో జరిగిన అనేక సామాజిక దాడులకు, సంఘటనలకు కూడ తెలంగాణా కవులూ, కళాకారులు అపూర్వంగా స్పందించిన విషయాన్ని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవడం అవసరం. ఈ పరస్పర సంఘీభావమే ప్రజాస్వామ్య మనుగడకు పట్టుగొమ్మగా విలసిల్లుతుంది.

"అన్నదమ్ముల్లా విడిపోదాం – ఆత్మీయుల్లా కలిసుందాం" అంటూ చారిత్రాత్మక నినాదంతో ఈ కవులు తెలంగాణాకు క్రియాశీలక సంఘీభావం ప్రకటిస్తున్నారు. "కుండల్లా విడిపోదాం – కలిసివుంచే కావడిబద్దను బలోపేతం చేద్దాం" (కావడి కుండలు – పైడి తెరేష్ బాబు) అని మహోన్నత ప్రేమతత్వాన్ని వాగ్దానం చేస్తున్నాడీ కవి.

*"నీ జెండాకు నే అండగా ఉంటా*
*నీ ఉద్యమానికి నా ఊపిరినిస్తా*
*నీ ధూంధాంలో దండోరా నవుతా" (రావినూతల ప్రేమకిశోర్)*

అంటూ ఈ కవులు తెలంగాణా మార్గంలో అడుగులో అడుగేసి నడుస్తున్నారు.

*"నీది ధర్మ పోరాటం'*
*నీ రణ క్షేత్రానికి నా శ్వాసను కాపలాగా పెడుతున్నాను" (కలేకూరి ప్రసాద్)*

తెలంగాణ ప్రజల చేతిలో చేయివేసి ఒట్టుపెడుతున్నారు ఈ కవులు.

ఘనత వహించిన సీమాంధ్ర ప్రజాప్రతినిధులంతా కపట నాటకంతో కలిసుండాలని రాత్రికి రాత్రే రాజీనామాలు చేస్తే ఉద్యమ దర్శనంతో సీమాంధ్ర కవులు రాష్ట్రం విడిపోవాలని వీలునామా రాస్తున్నారు. తెలంగాణా ప్రజల పట్ల సానుభూతితోనో లేక తమ సృజనాత్మక ఔదార్యాన్ని నిరూపించుకోవాలనో సీమాంధ్ర కవులు సంఘీభావం ప్రకటించటం లేదు. ఉద్యమ వాస్తవికతను, చిన్నరాష్ట్రాల ఆవశ్యకతను గుర్తెరిగి

*"ఎవడి రాజ్యాన్ని*
*వారు ఏలడంలోనే*
*జీవన సౌందర్యముంది (ముసుగు – అరసవిల్లి కృష్ణ)*

అనే తాత్విక ఎరుకతో ఈ కవులు ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షలను బలపరుస్తున్నారు.

"ప్రాంతాలు విడిపోవటం అనేది కేవలం భావన కాదు. దాని వెనక ఉన్న ఆర్థిక అసమానత. ఈ అసమానతలు కొన్ని సామాజిక వర్గాల అస్తిత్వాన్ని తుంచి వెయ్యడం దీర్ఘకాలంగా జరుగుతున్నప్పుడు సామ్రాజ్యాల నుంచి దేశాలు, దేశాల నుంచి రాష్ట్రాలూ, రాష్ట్రాల నుంచి ప్రాంతాలు విడిపోవడం అస్తిత్వం కోసమే. తద్వారా తమ ప్రాంతంలోని వనరులపై తమకు స్వయం నిర్ణయాధికారం ఉండాలని బలంగా చెప్పడమే. ప్రపంచమంతటా ఇది అనివార్య పరిస్థితి" అని ప్రాంతీయ అస్తిత్వ ప్రాధాన్యతను స్పష్టంగా తెలియ జేశారు (నగరానికొచ్చిన నాగళ్ళు– ముందుమాట) విద్యాసాగర్.

ఇలాంటి ప్రాపంచిక వివేచన ఈ సంకలనంలోని కవిత్వంలో సర్వత్రా దర్శన మిస్తుంది.

*"ఏకపక్ష దోపిడీకి ఏకైన సూత్రం*
*కలిసి ఉంటే కలదుసుఖం*
*దగాపడ్డ బిడ్డలకు తారకమంత్రం*
*వేరుపడితే ప్రగతి సులభం" (కావడి కుండలు)*

నలభైయేళ్ళ తెలంగాణా ప్రజల జీవన పోరాట సారాంశాన్ని నాలుగు పాదాల్లో అద్భుతంగా సూత్రీకరించాడు పైడి తెరేష్ బాబు. ఐక్యతకు – విభజనకు మధ్య ఉన్న దోపిడీ వ్యూహాన్ని రాజకీయ రహస్యాల్ని బట్టబయలు చేశాడీ కవి.



*"వేరు పురుగు సమైక్యవేదం వల్లించడం సహజాతి సహజం.*
*ఆకలిపేగు వేరుకుంపటి కోరడం అద్భుత చారిత్రక సందర్భం*
*(కావడి కుండలు)*

వేరు పురుగుల సమైక్య వేదాన్ని ఖండిస్తూ, ఆకలి పేగుల వాదానికి అండగా నిలుస్తున్నాడు తెరేష్ బాబు. సీమాంధ్ర కవులు ప్రత్యేక వాదాన్ని భుజాలకెత్తుకోవడంతో పాటు, సమైక్య వాదాన్ని తమ భావనా పటిమతో తుత్తునియలు చేయడం గొప్ప విశేషం. మేడిపండు వంటి సమైక్య వాదానికి తాత్విక పునాది లేదని ఈ కవులు వాదిస్తున్నారు. దశాబ్దాల తరబడి నిర్మించుకున్న పెట్టుబడుల స్వర్ణసౌధాలు పేకమేడల్లా కుప్పకూలి పోతాయనే భయంతో కొందరు పెద్దమనుషులు కుహనా ఐక్యతను వల్లిస్తున్నారని సీమాంధ్రకవులు తమ కవిత్వం ద్వారా నిరూపిస్తున్నారు.

*"ఐక్యత అనేది ఓ కుట్ర*
*విభజన అనేది ఓ ప్రజాస్వామ్య సూత్రం*
*(ప్రజాస్వామ్య సూత్రం – డా॥ జి.వి.రత్నాకర్)*

సమత్వంలేని ఐక్యతకు అర్థంలేదని అంటూ తెలంగాణా ఉద్యమం ప్రజాస్వామ్య బద్ధమైనదని కవి తన సమ్మతిని తెలియజేస్తున్నాడు. సమైక్యవాదం ఒక శుష్కనినాదమని "కన్నీళ్ళను హైజాక్ చేసే పేరడీ ఉద్యమ"మని ఈ కవులు తీర్పుచెబుతున్నారు. బౌద్ధాన్ని అణిచివేయడానికి పుష్యమిత్ర శుంగుడు ప్రతీఘాత ఉద్యమం చేపట్టినట్లుగా తెలంగాణా ఆత్మగౌరవాన్ని అంతం చేయడానికి సీమాంధ్ర రాజకీయ నాయకులు సమైక్యవాదాన్ని ముందుకు తెస్తున్నారని (పుష్యమిత్రులు) డా॥చల్లపల్లి స్వరూపరాణి చారిత్రక అవగాహనతో వ్యాఖ్యానిస్తుంది. సమైక్యాంధ్ర ఉద్యమంలోని "లోగుట్టు"ను ఎంతో సాహసోపేతంగా తేటతెల్లం చేసిన సీమాంధ్ర కవులు 'విభజన'లోని ఆంతర్యాన్ని శాస్త్రీయంగా విశ్లేషిస్తున్నారు.

రాష్ట్ర విభజనను అనునిత్యం అడ్డుకుంటూనే 'ఇచ్చేది' 'తెచ్చేది' మేమేనని రాజకీయ ప్రగల్బాలు పలుకుతున్న నాయకోత్తముల మాయనాటకాలకు తెరదించుతున్నారీ కవులు.

*"ఊరపెట్టనీకి అది ఊరగాయకాదు*
*మాగ పెట్టనీకి అది పచ్చిపండు కాదు*
*గోడమీద పిల్లి జపమూ కాదు*
*కోసుకు మింగనీకి కోడిపుంజూ కాదు" (తెలంగాణ వొట్టినినాదం కాదు)*

అంటూ రాజ్యం చెంప ఛెళ్ళుమనిపిస్తూ, పాలకవర్గాల కుటిలనీతిపై కొరడా ఝళిపిస్తున్నాడు సజ్జా వెంకటేశ్వర్లు. స్వార్థం అనే గోడపై ఊగిసలాడుతున్న రాజకీయ మార్జాలాల పై నిప్పులు చెరుగుతున్నాడు కవి.

*"నువ్వు పురిటిబిడ్డ ఇవ్వనంత మాత్రాన*
*పురిటినొప్పులు ఆగవు*
*వాలుతనం లేదని దూకే జలపాతం నిమ్మళించదు*
*ఇప్పుడిక అక్కడి నెమళ్ళకు*
*పురివిప్పినాట్యం చేసేందుకు*
*చక్కరాల్ఫుని మేఘంతో పనిలేదు*
*అగ్ని చెప్పులు తొడుక్కున్న పాదాలకు*
*ఇక కాలిబాటలు అవసరం లేదు" (మోదుగుపూలు)*

తెలంగాణ ఉద్యమ పరాకాష్ఠ స్థితిని తెలియజేస్తున్నాడు షేక్ కరీముల్లా. ప్రాధేయపడే దశ నుండి ప్రతిఘటనాత్మక దశకు చేరుకున్న ఉద్యమ తీవ్రతను కవి సమర్థవంతంగా కవిత్వీకరించాడు. 'హైకమాండు' దయాదాక్షిణ్యాలు, 'అమ్మగారి' కరుణా కటాక్ష వీక్షణాలతో నిమిత్తం లేకుండా ప్రజల సంకల్ప బలంతో ప్రత్యేక రాష్ట్రం ఆవిర్భవించి తీరుతుందని కవి భరోసా ఇస్తున్నాడు.

*"పువ్వు పుష్పించడానికి కొమ్మను ప్రాధేయపడనట్లు*
*బిడ్డ జన్మించడానికి అమ్మనైనా సరే అడగనట్లు*
*తెలంగాణా ఉదయించటానికి*
*ఏ ఆంధ్రుడు అనుమతి అవసరంలేదు" (జననం ఒక జన్మహక్కు)*

అని అసాధారణ సాదృశ్యంతో తిరుగులేని వాదనాగరిమతో న్యాయవాదిలా గర్జిస్తున్నాడు నేతల ప్రతాప్ కుమార్. ఈ కవితా సంకలనంలో సీమాంధ్ర కవులు తెలంగాణ అనివార్యతను ఎలుగెత్తి చాటుతున్నారు. అంగీకారయోగ్యమైన వ్యాఖ్యానంతో ప్రత్యేక రాష్ట్ర సాధనకు చెయ్యెత్తి జైకొడుతున్నారు.

*"స్వయం వ్యక్తిత్వ ప్రకాశానికి*
*అవిభక్త కవలకు శస్త్ర చికిత్స చేసి*
*శిరస్సులను వేరు చేయాల్సిందే" (దాట్ల దేవదానం రాజు - విభాజ్యం)*



*"గాయాలను కెలుక్కుంటూ ఎగిరెగిరిపడటంకంటే*
*తీయని జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ*
*సోదర భావనారేఖ మీద*
*చెరో సంతకంగా విడిపోదాం"*
*(తెలుగుభాషా సమైక్యతారాగంగా సాగిపోదాం - కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి)*

*"ఏం మొగుడూ పెళ్ళాలకూ*
*తల్లిదండ్రులకు పిల్లలకూ*
*అన్నదమ్ములకు పార్టీలకు*
*విడిపోతే లేని నష్టం*
*రాష్ట్రాలు విడిపోతే ఏంటంట?" (రాచపాలెం చంద్రశేఖరరెడ్డి - ప్రశ్న)*

*"కొమ్మ ఎంత అందమైనదైనా*
*నీరు ఎంత స్వచ్ఛంగా ఉన్నా*
*నగర హృదయపు ఔదార్యం ఎంత గొప్పదైనా*
*అనుబంధం ఎంతగా పెనవేసుకున్నా*
*అతిథి'కి ఎప్పుడూ...*
*విడిది సొంతం కాదు" (దేశరాజు - విడిది)*

రాష్ట్ర విభజనలోని ఔచిత్యాన్ని న్యాయబద్ధతను ఈ కవులు నిజాయితీగా చిత్రిస్తున్నారు. కోటి రత్నాలవీణ మీటి సీమాంధ్ర కవులు నవ జీవన విముక్తి గీతాలను ఆలపిస్తున్నారు. "విడి కలిసుందాం", "కలి'విడి'పోదాం" అంటూ హృదయపూర్వకంగా నినదిస్తున్నారు.

*"తెలంగాణా చెల్లి"కి బాధ్యతతో అప్పగింతలు చేసేద్దాం.*
*మాసిపోని మమతలతో*
*ఒప్పందాలు చేసుకుందాం" (బొగ్గారపు రాధా కృష్ణ)* అంటూ పిలుపు నిస్తున్నారు.

సీమాంధ్ర కవులు తెలంగాణాకు సంఘీభావం ప్రకటించడంతో పాటు గత అనుభవాలను దృష్టిలో పెట్టుకుని కొత్త రాష్ట్రంలో రాజకీయాలను కూడ నిర్దేశిస్తున్నారు. తెలంగాణాలో అణగారిన వర్గాలకు రాజ్యాధికారం కావాలని డిమాండ్ చేస్తున్నారు.

శివసాగర్, ఉ.సాంబశివరావు, డా॥ కత్తి పద్మారావులు తెలంగాణాలో దళిత బహుజన రాజ్యం కావాలని ఎన్నాళ్ళనుంచో వాదిస్తున్నారు.

జాతీయోద్యమ సందర్భంలో అంబేద్కర్ "స్వాతంత్ర్యం అనే మంత్ర దండం, దోపిడిపాలక వర్గాలని అంతం చేయగలదా? స్వరాజ్య భారతంలో దళితుల హక్కులకు హామీ లభిస్తుందా?" అని ప్రశ్నించాడు. ఈ రకమైన రాజకీయ స్పష్టతలేని జాతీయోద్యమం వల్ల నా జాతికి మేలు జరగదని ఆయన నిర్ద్వంద్యంగా చెప్పాడు. అప్పుడాయనని అందరూ జాతీయోద్యమ వ్యతిరేకని రాజకీయ అభాండాలు వేశారు. స్వాతంత్ర్యానంతరం దళితుల జీవన పరిస్థితుల్ని గమనిస్తే అంబేద్కర్ ముందుచూపు అర్థమవుతుంది. అదే విధంగా భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు సందర్భంలో గూడా డా॥అంబేద్కర్ చాలా సూటిగా నిర్ధిష్టంగా మాట్లాడాడు. భాషాప్రయుక్త రాష్ట్రాల్లో కిందికులాలవారు ఆశించటానికి ఏమి మిగిలింది? నాయకత్వంలో వారికి భాగస్వామ్యం లభిస్తుందా? అని ప్రశ్నించాడు. అలా జరగకపోతే భాషాప్రయుక్త రాష్ట్రాలు అనికాకుండా జాట్ రాష్ట్రం, మరాఠా రాష్ట్రం, రెడ్డిరాజ్యాలుగా మిగిలిపోతాయని చెప్పాడు. ఇవాళ ఆయన మాటలు ఎంత నిజమో మనకర్ధమవుతుంది. ఈ అనుభవాల నేపథ్యంలో తెలంగాణా రాష్ట్రంలో దళిత బహుజనుల నాయకత్వముండాలని సీమాంధ్ర కవులు పట్టుపడుతున్నారు. ఉద్యమంలో జెండాల మోసినోళ్ళు బలిదానాలిచ్చినోళ్ళు, జైలుపాలయినోళ్ళు ప్రత్యేక రాష్ట్రంలో రాజ్యాధికారాన్ని పంచుకోవాలని సూచిస్తున్నారీ కవులు.

*"తెల్లదొరల నుండి స్వాతంత్ర్యం తెచ్చి*
*నల్లదొరల చేతుల్లో పోసినట్లు*
*తెలంగాణాను మళ్ళీ దొరల పాల్జేయకు*
*రామరాజ్యం పేరుతో మనురాజ్యంరానీయకు*
*భీమరాజ్యం ఆశ్రయంగా*
*బహుజన తెలంగాణ సాధించు" (నేతల ప్రతాప్ కుమార్)*

*కాలం కత్తుల వంతెన మీద నుంచి*
*ఐలమ్మల వారసత్వం ఉరికి వస్తానంటుంది (డా॥ నూకతోటి రవి కుమార్)*

*ఎప్పుడూ యాడ - అరవనోణ్ణి యానాదోడ్ని*
*ఇప్పుడు గొంతెత్తి అరవబోతుండ*
*"ఆడ తెలంగాణ మా అలగా జనానిదే*
*ఈడ ఆంధ్రా మా అలగా జనానిదే*
*ఆడా మేమే- ఈడా మేమే (ఇ.వి. - ఆడామేమే ఈడామేమే)*



*మా అలీశమ్మ అయిలమ్మతో చేయి కలిపింది*
*మా కంచికచెర్ల కోటేశు కొమరయ్య బాటపట్టాడు*
*పాట చిక్కనై పదునెక్కి నీతోనే నడుస్తుంది*
*వెంటాడే కలాలు నీతోనే, నీవెంటే వుంటాయి ఎప్పుడూ...*
*రేపటి తెలంగాణ*
*దళిత బహుజన ఉద్యమాల విజయకేతనం (జుగాష్విలి-నీతోనే... నీవెంటే..)*

తెలంగాణా రాజ్యంలో దళిత బహుజన విజయ కేతనం రెపరెపలాడాలని ఈ కవులు మనసారా ఆకాంక్షిస్తున్నారు. ఈ న్యాయమైన ఆకాంక్షలు నెరవేరితేనే ఉద్యమ త్యాగాలకు సార్ధకత చేకూరుతుంది.

విభిన్న సామాజిక శ్రేణులకు, సాహిత్య వాదాలకు చెందిన కవులు కవిత్వం రాయడం వల్ల ఈ సంఘీభావ సంకలనంలో అపూర్వమైన వైవిధ్యం చోటు చేసుకుంది. డా॥దార్ల వెంకటేశ్వరరావు (మీ బాటలోనే మాదిగోళ్ళూనూ), కృపాకర్ మాదిగల (దండోరా ధూమ్‌ధామ్) దండోరా స్ఫూర్తితో తెలంగాణాకు మద్దతు పలుకుతున్నారు. దండోర, తెలంగాణా ఉద్యమాలకు అభేదాన్ని ఆపాదిస్తూ ఆయా ఉద్యమాల వ్యతిరేక శక్తుల్ని తీవ్రంగా విమర్శిస్తున్నారు. డా॥ వినోదిని దళితస్త్రీ దృష్టికోణంలో నుండి ప్రత్యేకవాదానికి స్వాగతం పలుకుతుంది. తెలంగాణా పోరాటంలోని కుల పితృస్వామ్య భావజాల తీరుతెన్నుల్ని పరిశీలనాత్మకంగా విశ్లేషిస్తూ

*"తెలంగాణా రావాల్సిందే*
*ఎల్లమ్మ ముఖ్యమంత్రి కావాల్సిందేనని"*

కొత్త నినాదాన్ని తెలంగాణా ఎజెండాలో ప్రవేశపెట్టింది.

పసుపు లేటి గీత రాయలసీమ వెనుకబాటుతనాన్ని ఎత్తిచూపుతూ తెలంగాణా వాదానికి చేయూత నందిస్తుంది. 'కావడి కుండలు' కవిత్వంలో సంఘీభావంతో పాటు ఓటు బ్యాంక్ రాజకీయాల స్వార్ధపూరిత వైఖరిని కవులు నిరసించడం కనిపిస్తుంది. ఆంధ్రా వలసవాదుల ఆధిపత్యవాదంతో పాటు తెలంగాణా రాజకీయ నాయకుల అవకాశ వాదాన్ని, పాలకవర్గాల దుర్మార్గమైన పక్షపాత దృష్టిపై కూడా సీమాంధ్ర కవులు అక్షరాయుధాలను సంధిస్తున్నారు.

"రావమ్మా
తెలంగాణా నువ్వొస్తేనే
మా కవిదోస్తుల యింట
ముక్కబువ్వ తినాలని
ఒట్టు పెట్టుకున్నానమ్మ" అంటున్నాడు సజ్జా వెంకటేశ్వర్లు.

ఈ చారిత్రత్మాక 'ధావత్' కోసం సీమాంధ్ర కవులు ఆవురావురుమంటూ ఎదురు చూస్తున్నారు.

ఆదర్శ సమాజంలో ఒక చోట మార్పు జరిగితే ఆ మార్పు అన్నిచోట్ల ప్రతిఫలించాలి. ఆదర్శ సమాజంలో అందరూ ఇష్టంగా పంచుకోగల సమాన హక్కులుండాలి అంటూ అంబేద్కర్ ఆదర్శ రాజ్యానికి కొత్త భాష్యం చెప్పాడు. ఈ విధమైన రాజకీయ కార్యాచరణ, పాలనాపరమైన సమతౌల్యం చిన్న రాష్ట్రాల్లో విలసిల్లాలని సీమాంధ్ర కవులు భావిస్తున్నారు. అప్పుడే తెలంగాణాలో మరింత వెనకపడిన ప్రాంతాలతో పాటు రాయలసీమ, ఉత్తరాంధ్రలకు సమాన న్యాయం జరుగుతుంది.

సీమాంధ్ర కవులు 'కావడికుండల' నిండా సంఘీభావ కవితా జీవజలాన్ని మోసుకొస్తున్నారు. ఈ జీవ జలం సమైక్యవాద పెనుమంటల్ని ఆర్పడంలోను, తెలంగాణా ప్రజల ఉద్యమదాహార్తిని తీర్చడంలోను మహత్తరమైన పాత్రను పోషిస్తుంది.

**కోయి కోటేశ్వరరావు**



## కవితాధార



పైడి తెరేష్ బాబు

## కావడి కుండలు

ఏకపక్ష దోపిడీకి ఏకైక సూత్రం
"కలసివుంటే కలదుసుఖం"
దగాపడ్డ బిడ్డలకు తారకమంత్రం
"వేరుపడితే ప్రగతి సులభం"

***

ఇంకా అదేబతుకు! అదేచావు
ఇస్తే తీసుకునే దగ్గరే గిడసబారిపోయాం!
స్వతంత్రదేశంలో
ఈ సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర దేశంలో
ఇంతకన్నా 'పచ్చివిషాదపుసిగ్గుచేటు' ఇంకోటుందా?
ఇచ్చేదొకరు ! పుచ్చుకునే దొకరు! ఇదే ప్రజాస్వామ్యమట
ఇంతకన్నా దగాకోరు నిర్వచనం ఎక్కడైనా వుందా?

అప్రజాస్వామికంగా అణచివేయబడ్డం
ప్రజాస్వామికంగా దేబిరించడం
ఇంకా అదే విఫల ఫార్ములా!

***

ఇవ్వకుండానే కబ్జాచేయడం - గతం
ఇస్తే తీసుకుందామనుకోవడం - ప్రస్తుతం
గతం - వలసవాదం
ప్రస్తుతం - ప్రత్యేకవాదం
వేరుపురుగు సమైక్యవేదం వల్లించడం సహజాతి సహజం!
ఆకలిపేగు వేరుకుంపటి కోరడం అద్భుత చారిత్రక సందర్భం!!
కనిపించని విభజనరేఖలు కలాలకొద్దీ రాశారు కదా
కనిపించే ఒక్క విభజన రేఖ గీయడానికి మాత్రం
వేళ్ళు కాళ్ళు దేహం దేశం వణికి చస్తున్నయ్
దేనికో!

కొత్తనింగీ కొత్తనేల కొత్తగాలీ కొత్తనిప్పూ కొత్తనీరూ
ఏమీ అక్కర్లేదు
పాతనేలకు ఒక కొత్తరేఖ కావాలి
హస్తసాముద్రికులారా!
అరచేతిలో వైకుంఠం కాదు
ఇప్పుడో ప్రత్యేక రాష్ట్రం కావాలి.

***

ఇంకా అదే బతుకు! అదే చావు !

గుండెలు బాదుకోవడం
గుక్కపట్టి ఏడవడం
నినాదాలముసురులో
నిత్యం తడిసి ముద్దవడం

జెండాలను నమ్మడం
ఎజెండాలను అమ్మడం
విప్లవాలను నమ్మడం
వీరత్వాన్ని అనుకరించడం



త్యాగాలను కీర్తించడం
యాగాలను సమర్థించడం
అమ్మల పొత్తికడుపుల మీద
అమరత్వపు కోతలు కోయడం
ఇంకా అదే బతుకు! అదే చావు !

దొంగమేతల దున్నపోతుల్ని తరమలేం
వేదికల్ని వాడుకునే దళారీల్ని తన్నలేం
ఉటోపియన్ ఉచ్చుగుంటల్ని దాటలేం
యూరోపియన్ ముచ్చుమాటల్ని వదల్లేం
ఒళ్లుకాల్చుకునే నిరసనల్ని మించలేం
మోస్తున్న లేతపాడెల్ని దించలేం
పగటికలల పాటల్ని ఆపలేం

శాంతియుత హత్యాకాండకు లోనవుతాం
చట్టబద్ధ చెరిచివేతలకు గురవుతాం
ఆత్మగౌరవ పోరాటాలకు
ఆత్మహత్యల్ని ప్రత్యామ్నాయం చేస్తాం
ఇంకా అదే బతుకు! అదే చావు!
ఇంకా అదే సమరం! అదే శోకం!

ఉద్యమించడం ఊకదంచడం
ఇంకా అదే నిశ్చలయాత్ర !
జ్వాలలెగయడం జోలెచాపడం
ఇంకా అదే భిక్షుక పాత్ర!

మీడియా మాఫియా మిడిమేలపు మేనియా తప్ప
పందొమ్మిదొందల పదికీ రెండువేలపదికీ
తేడా ఏమన్నావుందా?!?
ఇంకా అదే --
***

నాలుగు దశాబ్దల బానిసత్వం సాక్షిగా
నాలుగు దశాబ్దల వలసతత్వం సాక్షిగా
మంటకూ దీపానికీ మధ్య వున్న
తాత్విక భేదం గుర్తించలేమా ?
తగలబెట్టడానికీ వెలిగించడానికీ మధ్యవున్న
తార్కికభేదం పసిగట్టలేమా ?

కుండా కుండా కొట్టుకొనేట్టు చేయడం
కుట్రదారుడి వ్యూహరచన !
కూడు బొక్కిన కాకిలెక్కలు
'ఒంటె'త్తుపోకడల ధ్వంసరచన!

కుట్రదారుడి భుజాలమీంచి
ఉన్నఫళంగా దూకడమే యిప్పుడు ఉద్యమం
కలిసివుంచే కావడి బద్దను బలోపేతం చేద్దాం!
కుండల్లా విడిపోదాం!
కావడిలా కలిసుందాం!!







కృపకర్ మాదిగ

## దండోరా ధూం ధాం

పసులు గాసి
చెప్పులు కుట్టెటోల్లకి
సదువులెందుకు
'ఎబిసిడిలు' వొద్దంటాడు ఒకడు

బాంచెగిరిలుండి
గాయిది పని చేసెటోల్లకి
గణతంత్రమెందుకు
'హోకురూలు' కూదదంటాడు ఇంకొకడు

యాభైతొమ్మిది గుంపులకీ
రాయితీల మెతుకులు పంచొద్దు
అంతా మేమే బొక్కుతాం
ఇదే సామాజిక న్యాయం
అంబేద్కరు మా తాత అంటూ
గుంపులన్నింటినీ జాబితా ముద్ద చేసి
అవకాశాలన్నింటినీ 'ఐక్యం'గా జొరుకుంటూ

గూడెం గోచీలను దొంగిలించి
లంగోటీలుగా చుట్టుకుంటుండు ఒకడు

సొరాజ్జం అడగొద్దు
తెలుగు తంత్రంతో కొల్లగొడతాం
ఇదే సమైక్యవాదం
తెలుగుతల్లి మాయమ్మే అంటూ
తెలంగాణకి తెడ్డు చూపి
నీళ్ళు నిధులు ఉద్యోగాలు
'సమైక్యం'గా దొబ్బుకుపోతూ
మెరక దుక్కాల్ని ఏటి నిండా దోచుకుని
నీటి గింజలు నింపుకుపోతుండు ఇంకొకడు

యాందిరా అంటే
'కులాలన్నింటికీ కుండ ఒక్కటే
దళితుల్ని విడదీస్తారా' అని వాడు
'ప్రాంతాలన్నింటికీ పాలనొక్కటే
రాష్ట్రాన్ని ముక్కలు చేస్తారా' అని వీడు
గడుసు కబ్జాలకి దిగుతున్నారు

థూ...
నీ... యింటి దొంగలకు నా చెప్పుగొట్ట
నీ కో...మాల దబాయింపులపై దండోరాలెయ్య
నీ కో.... వలస దొమ్మీలపై ధూం ధాం చెయ్య







**దాట్ల దేవదానం రాజు**

# విభాజ్యం

చరిత్ర ఉపేక్షించిన బలిదానాలు
ఇక ప్రచ్ఛన్నంగా నైనా స్ఫురణకొస్తాయి
ఏకముఖమైన గతం
దుఃఖ జ్ఞాపకంగా మెలిపెడ్తుంది

అస్తిత్వ వేదనల్ని ముసుగేసి
కప్పగలిగే ఉపకరణాలు లేవు
నిత్యం సెగలో వేడి కాగడానికి
సమస్యని సజీవం చేసే నేతల
మనో యవనికలు చిరిగి తీరతాయి

అంతః కరణలు పరిశుద్ధమైనవే
ఉగ్గు పాలతో నూరిపోయాల్సిన
జీవన పాఠాలు
విస్మృతిలోకి జారి పోయాయి
మనోభావాల అదృశ్యచాలనం
నిప్పురవ్వపై నివురు లాంటిది.

స్వయం వ్యక్తిత్వ ప్రకాశానికి
అవిభక్త కవలలకు శస్త్రచికిత్స చేసి
శిరస్సులను వేరు చేయాల్సిందే
అధునాతన స్వరాల్ని సవరించుకుంటూ
వెలి పీఠాలెక్కి ఊరేగాల్సిందే
దేహమంతా చమురు పూసుకుని
కరచాలనాల్లో కల్మషాల జిడ్డు దాచుకుని
ఉన్నట్టుండి శత్రువులై పోవడం
కళ్ళల్లో ఈర్ష్యాగ్నుల్ని పెట్టుకుని
రక్త సంబంధాల్ని తూలనాడుకుంటూ
విధ్వంస చలనాలుగా మారిపోవడం
మాటల సమరాలతో అలసిపోతూ
వైర నిర్వాతనాల్ని పెంచుకుంటూ
కలవని భుజాలయి పోవడం
పరస్పరం అనుమానపు చూపులతో
ఎందుకు తమ్ముడూ!
మనం విభాజ్యమై వెలగడానికి
ఆకాశంలో తోకచుక్క పొడవాలా?
సముద్రం చీలి దారివ్వాలా?







డా॥ కత్తి పద్మారావు

# ఒక వెలుగు సంద్రం కోసం

ఒక మంచిమాట కరువయింది
అంతా ద్వేషానలమే
అగ్ని కూడా పచ్చిగామండుతుంది
అందరూ గాయాలనే ఇష్టపడుతున్నారు
స్నేహలతలు పూయడం మానేసాయి
మొగ్గలు విచ్చుకోవడానికి
సూర్య కిరణాలేవి?
గాడాంధకార లోయల్లో
కారబ్బంతి పూలు
దీపాల్లా వెలుగుతున్నాయి
ఎక్కడ చిన్న దీపం కనబడినా
అది సూర్య గోళంలా భాసిస్తుంది
ప్రపంచమంతా చీకటి కమ్ముకున్నప్పుడు
వెలుగు రేఖలోనే కదా! నడక
నిజమే! మనుషులు ఎవరికివారే
జీవిస్తున్నారు.
నిట్టనిలువునా ఎదుగుతున్నారు

ఆక్రందన, ఆవేదన, ఆవేశం
అన్నీ పెను కేకల్లో ఇరుక్కొని
సంక్షోభంలో ఉన్నాయి
విశాలత్వాన్ని కోరుతున్నవాడు
గుహ నుండి బయటికొచ్చిన ఎలుగుబంటిలా
చీరుతున్నాడు
మానవతాదీప్తి
కొడిగట్టి పోతుంది
ఎవరెందుకు
ఘర్షిస్తున్నారు ?

నిన్న కారంచేడు వధ చేసినవాడు
నేడు సమైక్యతా కేకలేస్తున్నాడు
నిన్న రిజర్వేషన్లకు వ్యతిరేకంగా
పోరాడిన వాడు
ఈ రోజు గీతలు
గీయొద్దంటున్నాడు
ఏమి పోగొట్టుకోవడానికి ?
ఏమి సంపాదించుకోవడానికి ?
దురాక్రమిస్తున్న వాడిదీ
ఒకే అరుపు!
ఆక్రమించబడుతున్న వాడిదీ
ఒకే అరుపు!
ఏది ఆక్రమణో
ఏది జులుమో
అర్థం కానితత్వం
రోడ్డుమీద కూర్చున్న వాళ్ళంతా
సత్యాగ్రహులేం కాదు
సత్యాన్ని వధించలేక



నాయకమ్మన్యుడవుతున్నాడు
అందుకే సత్యం
ఒక వెలుగు సంద్రం
ఒక వధాతీతం
వృథా జన్యం
నిజాయితీ ఓ విద్యున్మణిదీపం
వ్యక్తులు నశిస్తారు
వ్యవస్థ జ్వలితమానం చేస్తుంది
సంపద ఆకలి
ఆక్రందనలవైపు ప్రవహిస్తుంది
అస్తిత్వవాదం
అనివార్యం





ఎ. విద్యాసాగర్

# నగరానికొచ్చిన నాగళ్ళు

ఎంత బాగా తెలుసు ఈ నేలనాకు
మనసంతా యిక్కడే
బతుకున్నంత వరకు !

నల్లగొండల అంచు రేగళ్ళ పళ్ళెమిది
కారడవులు, కొండలూ, ఏటిగట్టు తోటలూ
నల్ల బంగారం గనులు, తెల్ల పసిడి చేలు
ఎదిగొచ్చే పసిబిడ్డల వొళ్ళోనే లాలించే
వయసు తల్లి ప్రేమలా
రేగడి చెలకల మధ్యన
చిగురిస్తూ మెరిసిపోవు అడ్డ గుట్టలు.

ఒకదాని వెంటొకటి పలు ఛాయల పచ్చలు
తెరలు తెరలుగా విచ్చే వేసంగి ఎండలు
ఈ నేలకు ఈ నేలకే సొంతం!
నీరెండలో నడుస్తున్న ఉల్లాసమైన అనుభవం
ఈ గడ్డను తాకితే !



సమ్మక్క సారక్కల ధీరత్వం గుర్తుగా
రాచరికం ఊళ్ళ మర్రి వొడిలోంచే నిక్కిచూసే
పద్నాల్గు తలల తాడి మాన్లలా
ఈ నేల సేద తీర్చు లక్నవరం
రామప్ప పాఖాల చెరువులూ
పైరగాలిలో ఊగే కుంకుమ పూలను ప్రేమగా
రూపుమాపు పూయించే చిట్యాల చెలకులు.

మసకేసిన మధ్యాహ్నం నెమ్మదిగా సెలవిస్తే
ఊరికెళ్ళు ఉబలాటం సాక్షిగ
జిటెరేగి పూల లోలాకులు హుషారుగా పెట్టుకొని
వడివడిగా సాగిపోవు ఊరి దారులు
ఉన్నంతలో తృప్తిపడి (పగడపు) దుద్దుల్నే నిండుగా
వొళ్ళంతా పెట్టుకున్న బలుసూ, నక్కెర చెట్లూ.

1
ఎంత బాగా తెలుసు ఈ నేలనాకు
మనసంతా యిక్కడే
బతుకున్నంత వరకు !

ఉరకల పరుగుల ఉద్వేగానికి
ప్రమత్తత నెరగని ప్రశాంతతకు
సజీవ భావ బంధాలు
కుడి ఎడమల గోదావరి కృష్ణలు
చిట్టడవులు చెలకల్లో
అల్లిబిల్లిగా సాగే లెక్కెరగని వాగులు.

ముసురు పడితే వురకలేసి
బిలబిలమని పరిగెత్తే ఆటగాయి పిల్లల్లా
తొలకరి జలజలకు తడిసి

చిటపటమని ఎగిసొచ్చే గరిక పోచలు
జల్లు కురిసి కురవగానే
వొళ్ళు మరిచి దూసుకొచ్చే
దుబ్బు గడ్డి, మొక్కజొన్న
టమాటా, సొరపూల పాదులు.

నెమలి కన్నుల రంగులతో
గోరెంకల పాటలతో
గోగురిచ్చ మునకలతో
కొండలు, గుట్టలు, అడవులు, నదులూ
ఈ నేలకు ఈ నేలకే సొంతం

పైరగాలి వెంట వెళిపోయే కోర్కెతో
గాలికి దండం పెడుతూ
కొలను నీళ్ళలో విరిసిన
మెరిసే బిళ్ళలాంటి ఆకులతో
దారిపక్క వొరిగిపోయి
వోరముఖం పెట్టుకున్న రేగిమాకులు.

పచ్చజొన్న చేలమధ్య గండు ముక్కు చిలకల్లా
చికుబుకుమని పరిగెత్తే ఎర్రెర్రని రైళ్ళు
పసుపు ఎరుపు వింత కాంతి కసకసమనే జరీ చీర
వొళ్ళంతా కప్పుకున్న పెళ్ళికొడుకు పెత్తల్లుల్లా
విరగబూసి నిలబడే చింత తోపులు.
వానకెన్ని రంగులో
ఈ నేల చూస్తే తెలుస్తుంది !

ఊళ్ళోనే ఉంటున్న చిన్నప్పటి దోస్తుల్లా
చెలకల్లో పొదుకున్న సీతాఫల్, మోదుగ, వాయిల
మంగ, చీకిరేని, గొటిక,



పరికి, పాలబరికి, కలివె, తంగెడ పొదలు
పలు ఛాయల్లో పచ్చలు ముచ్చటగా మెరిస్తే
తొలివయసును తలపించే తెలంగాణ పల్లెలు
తురాయి పూలు పరుచుకున్న
ఈ నిప్పుల దారికి నివాళి

ఒక దేశపు విస్తృతి
తన అణువణువున చూపించే
ఎంత గొప్ప కల్పవల్లి
అచ్చమైన తెలుగునేల
గుండె డప్పుల హేల
తరతరాల వెలుగు జ్వాల !

ఎంత బాగా తెలుసు ఈ నేల నాకు
మనసంతా ఇక్కడే
బతుకున్నంత వరకు!
యుగ యుగాల కిందట
గోదావరి మాత తెలివాహగ
తొలి అడుగులు వేసిందిక్కడే కదా!

మనిషి చరిత్రకు ప్రకృతి సాక్ష్యం
శిలాజాలుగా మిగిలిన సత్యం
సింగరేణిలో అతి స్పష్టం
మెసపుటేమియా నేస్తంగా తన జాతి చరిత్రను
తెలివాహ అలలపై ఊయల లూపిన నేల యిది.

ఆది మానవుల పుట్టినిల్లుగా
గోండ్వానా భూఖండంగా
బంగారు పంటలను కడుపున మోసే

నల్లెర్రని రేగళ్ళ
దక్కను పీఠభూమిగా
జీవ వైవిధ్యం వెల్లివిరిసిన
దండకారణ్య వన సీమలుగా
ఆదివాసులు ఏలిన నేల యిది.

మానవ జాతికి తొలి తొలి తాతలు
జాతి వికాసపు తొలి తొలి నేతలు
అవిరామంగా కలిసికట్టుగా
మనసారా తిరిగిన నేల యిది
తమ ఉనికి గుర్తుగా
జాతి నిరంతరత్వపు టానవాళ్ళుగా
కురిక్యాలలో రాక్షస గుళ్ళను పేర్చిన నేల యిది.

కాలం మూపున కొండ గుర్తులను
తరతరాలకూ మిగిల్చి పోయిన
శక నిర్మాతలు శాలివాహనులు పాలించిన నేల యిది.

పాశెగాంలో బౌద్ధారామం
కొలనుపాకలో తీర్థంకరుడు
బౌద్ధ బోధనల తొలి పలుకుల నిలయం
శాతవాహనుల సిగపువ్వై వెలిగిన
నాగార్జున విశ్వవిద్యాలయాలు
ఆదివాసులే కాకతీయులై
నీళ్ళ చెరువులను కాలి గొలుసులుగ
నేలతల్లి కర్పించిన భక్తితో
నీటికి నడకలు నేర్పిన నేల యిది

నల్ల రేగుళ్ళ మట్టి బెల్లమై
తీపి తోటలకు ఆలవాలమై



కన్నడాది కవి పంప మహాకవి
కవితలల్లిన ఇందూరు యిక్కడే

శివ శివ అంటే అందరూ సములని
సమతను నేర్పిన పాల్కురికి సోమన
బసవ పురాణం చెప్పిన నేల
శిలలకు జీవం పోసిన మనస్వి
జక్కన ప్రతిభ వికసించిన నేల

పాతాళంలో ఎత్తిపోతల జల సంగీతం
అడవుల కొండల మృగరాజు గర్జనలు
అనంత మూలికల జీవ శ్వాసను
నిరంతరంగా ప్రతిధ్వనించే
దుర్గమ సీమల నొడిసి పట్టిన
పాలమూరులో నల్లమలలతో నిండిన నేల

రాక్షసత్వమే రాజకీయమై
స్వేచ్ఛాపుత్రుల నణిచేవేళ
స్వేచ్ఛకు మించిన సంపద లేదని
జాతి వినా గుర్తింపూ లేదని
జోడెన్ ఘాట్‌లో సింహనాదమై
చెలరేగిన ధీరుడు కొమరంభీము
సర్వాయి పాపన్న సంతకముంచిన నేల
రైతుల పోరాట భూమిగా
చరిత్ర కెక్కిన చోటు యిది
చదువుల తల్లికి జగదైక నివాళిగ
బాసర దేవళ సానువులు
రాజులు సైతం ప్రజాహితాలను నిర్మిస్తారని
నిశ్శబ్దంగా నినదించే నిరుపమాన పతకాలు
నిజాంసాగర్, గండిపేట, హుస్సేన్ సాగర్లు

కంచెర్ల గోపని తీరిన ఆశలు
భద్రాద్రి రాముడై వెలిసిన నేల

రేలా రేలా పాటలతో
భూమి పండగల, కోత పండగల నాట్యంతో
అడవి తల్లికభివాదం చేసే కోయలు,
తెలుగు పలుకుబడి నతి స్వచ్ఛంగా
తరతరాల కందించే ధీ స్వరధారులు కొండల్లో రెడ్లూ
స్వేచ్ఛగా తిరిగిన నేల యిది.
పాళీ ప్రాకృత పైశాచీ తెలాంగ భాషల
దేశదేశాల కందించిన నేల

2
ఎంత బాగా తెలుసు ఈ నేల నాకు
మనసంతా యిక్కడే
బతుకున్నంత వరకు !

బడి ఎరగని బహుజనులే బహుళంగా ఉన్న చోట
ఎడారి బాట పక్కనే
కారల్ మార్క్స్ కాలనీలో
జెట్ సెట్ తహతహ నిండిన
ఇంగ్లీషు చదువు హైస్కూళ్ళు

పాయెదారి తనాలూ
సంచ కరువు బతుకులు
పల్లె పల్లెకూ మధ్య పారా కాస్తున్నాయి
ఆకాశం కేసి చూసే అడవి చెట్ల కిందనే
అబద్ధాల ముఖాముఖి
జంపన్న వాగు వొళ్లంతా నెత్తురు మడుగు
గుండ్ల వాగు అలజడిగా నిలువెల్లా చెమట పట్టి
గుండె దడతో పారుతోంది



పేదోళ్ళ పేర్లు ఏటికేడు జపించే
చిలకలకే ప్రమోషనొచ్చి
చెట్లే కొడుతున్నాయి
తల్లిని చంపిన వీళ్ళే
తన రక్తం పవిత్రమని
లాకెట్లో నింపుకొని
మెడకేసుకు తిరుగుతారు
నాగరికత పేర వీళ్ళు
నదులను చంపుతున్నారు
పట్టుపట్టి గెలవగలుగు వీరుళ్ళను తలపించే
మద్దీ, ఏగిన, తునికీ, బిల్లుడు, సంద్రా, కొడిశా
ఏదైతేనేం
సమంగా చూస్తోంది
అడవులు నరికే గొడ్డలు
ఈ గడ్డ మధ్య నిలబడి!

అడివంతా బోయినంక
ఆనగొట్టక పాయె
సెర్లు నిండక పాయె
కరువొచ్చి
కాపు దానోళ్ళకు కష్టమొచ్చింది
మట్టిలో మర్లాడే
మున్నూరు కాపులకు నష్టమొచ్చింది
సాలినంత ఆన సెర్ల దుంకక పోతే
చాపలమ్మి బతికె బెస్తోళ్ళ బతుకు
నీళ్ళతో పనిజేసె
నీరడోళ్ళ బతుకు నీళ్ళ కలిసింది
అడివి ఈసకపోతే
గొర్లమందతో బతికె కుర్మోళ్ళ బతుకు
సాలోల్ల పని సన్నాసుల్లో గలిసింది
పట్కరోళ్ళ దారాలు ఎవలు కొంటరిప్పుడు ?

యవుసం బోయినంక ఊరు బోయింది
కంచరోళ్ళ బతుకు బత్తలయింది
గోనె సంచులు గుట్టే పంజరోళ్ళ బతుకు
రాటలు, జల్లెండ్లు అల్లితే బతుకెల్తలేదు
కలాయి పనితనం ఖతం అయింది
అడివినే నమ్మిన బోయోళ్ళ బతుకు
కుందేళ్ళ నమ్ముకునే పిట్టలోళ్ళ బతుకు
కంచెలు గట్టమ్మే కుంచెర్కలోళ్ళ బతుకు
విస్తరాకులమ్మి యిల్లు నడిపేటోళ్ళ బతుకు
అడవిలో కలిసింది.
దేరాలల్ల ఉండె బయట కమ్మర్ల బతుకు
అద్దాలు పూసలమ్మే పూసలోళ్ళ బతుకు
రాయిగొట్టి బతికే వొడ్డెరోళ్ళ బతుకు
రాళ్ళ పాలయింది

తను కురిసిన ప్రేమను
గడీల్లోకి మళ్లించిన రాబందుల బంధువులు
ఇప్పటికీ తన పేరున నిర్భీతిగ తిరుగుతుంటే
ఆక్రోశం పట్టలేక
పేలవమై దిగులు పడే మసకేసిన ఆశాకం
తరం మారినాకైనా చిగురించే ఆశతో
నేలతల్లి నంటుకున్న తుంగ పోచ గడ్డల్లా
మినుకు మినుకు ఊపిరితో కొనసాగే వాళ్ళమీద
కసి తీరక విసిరేసిన
చెంబు ముంత తపేళాలు చింకిరి పాతల్లాగా
రోడ్డు వార వొంటరిగా పాతినుము సామాన్లలా
సగం పడిన గోడలతో వొణుకుతున్న వాడలు
పడగెత్తిన నాగుబాము గుర్తుపై పోటించే సర్పంచులు



3
ఎంత బాగా తెలుసు ఈ నేల నాకు
మనసంతా యిక్కడే
బతుకున్నంత వరకు !

ఇప్పుడిప్పుడే బడికెళ్ళే పోరలు
వడివడిగా కొత్తరాత రాస్తున్నారు
పొక్కిలి మగ్గం గుంటలో
పదునెక్కిన పాట వాళ్ళు పాడుతున్నారు

చెక్కిళ్ళపై యింకిన కన్నీళ్ళ జాలులా
కొత్తదారి చాళ్ళలో బతుకుయింకి పోతున్నా
తరతరాల ఆపత్ స్పృహ పంటలా చేతికొస్తుంటే
నాలుగు కవితలు నాగళ్లై
మళ్ళీ పురుడు పోసుకుంటాయి
ముఖమిప్పుడిక్కడ విషాద చిహ్నమవదు
అదివో అస్తిత్వ జ్ఞాపకం
పోరాట చింతనకు అభివ్యక్తి

అవ్వా నువ్వు యాదికత్తె
గుబులు గుబులు గైతాంది
సుద్దాం తియ్ ఎన్కటికేమైతదో!
అయినా నువ్వు యాదికత్తె
కోటి ఆశల వెలుగు

ఎంత బాగా తెలుసు ఈ నేల నాకు
మనసంతా యిక్కడే
బతుకున్నంత వరకు!





సతీష్‌చందర్

# ఇక్కడో పల్లె వుండాలి...!

నీళ్ళు లేని కళ్ళుంటాయని నాకు తెలుసు కానీ,
నీళ్ళులేని ఊళ్ళుంటాయని నాకు చాలా కాలం తెలీదు
కదిలితే నీళ్ళు కాళ్ళ సందుల్లో నీళ్ళు
కేరింతలకు నీళ్ళు కౌగిలింతలకు నీళ్లు
ఎక్కడో నాసికాత్రయంబకం నుంచి పరుగు మొదలుపెట్టి...
మొక్కేవాళ్ళు మొక్కగా...
మునిగే వాళ్ళు మునగ్గా...
తన దారిన తాను వచ్చి అలసి, సొలసి సముద్రపు వొడిలో
సేదతీరే చోట పుట్టుకొచ్చిన వాణ్ణి
నీళ్ళులేనితనం నాకెలా తెలుస్తుంది చెప్పండి?
అమ్మతోడు. ఒక రహస్యం మాత్రం తెలుసు
ప్రతీ అన్నం మెతుకూ అంతకు
ముందటి జన్మలో నీటిబొట్టని
నీరింకిన చోట... ఊరు ఊరే పరారవుతుందని మాత్రం తెలీదు
ఇక్కడొక రావి చెట్టు వుండాలీ - అని చెప్పినట్లుగా
ఇక్కడొక పల్లె వుండాలీ



అని ఎవరన్నా అంటే మనసులో ఎక్కడో కలుక్కుమంటుంది
ఎక్కడి లోగిళ్ళను అక్కడే వదిలేసి
ఎక్కడి నాగళ్ళను అక్కడే విసిరేసి
ఎక్కడి కుక్కిమంచాల్ని అక్కడే వుంచేసి
పల్లె వెళ్ళిపోయింది. కానీ
ఖర్చులేకుండా సత్వర మరణాలను ప్రసాదించే
ఏ పట్టణానికో వలసపోయింది
ఒక్కొక్క కుక్కిమంచం మీద ఒక్కొక్క గాజు కళ్ళ ముసలి అవ్వ
'ఎందుకవ్వా... నువ్వింకా ఇక్కడ?'
కాటికో... కూటికో...!!
చెప్పే ఓపికే వుంటే... తన చావు తాను చచ్చేది.
ఈ అవ్వ పేరు తెలంగాణ...!

(జూలూరి గౌరీశంకర్ - 'ముళ్ళకర్ర' ముందుమాట నుండి)





గుంటూరు ఏసుపాదం

# గుడ్ బై తెలంగాణ !

కాస్మిక్ అణువిస్ఫోటనంతో కాలముద్భవిస్తే
కాలాంత్రనాడి స్వేచ్ఛ...
స్వేచ్ఛ పుట్టాకే నువ్వు పుట్టావ్
యు ఆర్ బోర్న్ ఫ్రీ...

డైవర్జన్స్ యుగమేనాడో అంతమయింది
కన్వర్జెన్స్ ఇప్పుడు కాలసంకేతం
కావచ్చు...
అగాధాలు పూడాకే ఏకతా మంత్రం
గాయాలు మానాకే సమతారావం
కన్వర్జన్స్ ఇక్కడ వైయక్తికం....

పిట్ట తన గూటిపై తానో పతాకమై ఎగరాలి
తనపై నిలబడ్డ చెట్టుకు నేలనినాదాలు నేర్పాలి
మనిషి తనలోకి తాను వొరుసు కొరుసుకు ప్రవహించాలి
గతాన్ని ప్రశ్నించాలి.... వర్తమానాన్ని వాసిన గట్టాలి



ఎవడి భవితకు వాడే విధాత కావాలి
"లేట్ దేర్ బిఫ్రీడమ్"

నీ ఇచ్ఛే నీ స్వేచ్ఛ... రియలైజ్ ఇట్
నీ సంకల్పమే నిన్ను స్వతంత్రుణ్ణి చేస్తుంది
... బిలీవ్ యువర్ సెల్ఫ్
అంతః చేతనే నీ జీవాయుధం
... డోంట్ మిస్ ద టార్గెట్

సమాధి సంకెళ్లు ఛేదిస్తే
నువ్వో యోధుడివి... మృత్యుంజయుడివి
యు ఆర్ ద క్రౌన్ ఆఫ్ క్రియేషన్ !

ట్రస్ట్ నో వన్...
స్వేచ్ఛ నీకు శ్వాసైతే – వాడికి సంతలో సరకు
నువు ఆర్తిగా చూశావో
నీ ఆత్మనివాడు క్యాష్ చేసుకుంటాడు
నువు కంటతడి పెట్టావో
నీ కలలమీద జెండాపాతి పేటెంట్లు రాయించుకుంటాడు
ఆశగా నువు చేయిచాస్తే
నీ హస్తరేఖల్ని కాజేసి తన తలరాత మార్చుకుంటాడు
నీ పెళ్లాం పిల్లల్ని వొబ్బిడిగా వొంగబెట్టి
వేలకోట్ల సింగాసనాల కెగబాకుతాడు

నీ కన్నీటికి వెల... కలల కో వెల
ఆకలి కో వెల... ఆర్తనాదాని కో వెల
పొరబడీ తొరబడీ నువు బలవన్మరణిస్తే
నీ "విగత జీవుడి" కో వెల....
శవాలిక్కడ పొలిటికల్ పాస్టైమ్!
ట్రస్ట్ నో బాస్టర్డ్ !

నీకు నువ్వే దిక్కు
నిన్ను నువ్వే నమ్ముకోవాలి
నీ స్వేచ్ఛకు నువ్వే బీజమై కనలాలి
.... నీ కన్నీట నువ్వేనాని
..... నీ ఆకటి చీకట్లో నువ్వేమగ్గి
ప్రశ్నా విశ్లేషణా పరిభ్రమణంలో
నీ దౌర్బల్యాల్ని నువ్వే తునుమాడి
నీకు నువ్వే నిగ్గుదేలి
కర్మసిద్ధాంతాల... చచ్చు వేదాంతాల
ఇనుప కచ్చడాల్ని కాన్షియస్‌గా కుళ్లగించి ధ్వంసించి
నీలోని 'నువ్వే'నీవై
నీకు నువ్వే "నువ్వు"లా పెల్లుబికి రావాలి
స్వేచ్ఛాంకురం నువ్వై
స్వేచ్ఛకు నిర్వచనం నువ్వై "పునర్జ"న్మించాలి

అప్పుడు...
అప్పుడు కళ్లు తెరువ్...
నీ చుట్టూ జనసముద్రాలు
విస్మృత జాతుల ఉగ్రరూపాలు
నిదురలేచిన గూడాల గుండె దండోరాలు
కాలేపేగుల కలనేతలు
ఉరిమే గొంతుల యుద్ధ వ్యూహాలు
పీడితజన సమైక్య సమరోన్ముఖ విజృంభణలు
వీరుడివైనా విజేతవైనా ప్రజాయుద్ధానంతరమే...

సెట్ యువర్ సెల్ఫ్ ఫ్రీ....
ఆల్ ద బెస్ట్ అన్నా!
గుడ్ బై తెలంగాణా !!







**విరియాల లక్ష్మీపతి**

# కొత్త చరిత్ర కోసం

జంటగా ద్వాసుపర్ణాసయుజా సఖాయ అంటూ
ఒకే చెట్టు మీద వుంటూ
కొట్టుకొని చచ్చేకన్నా
దొంగ మార్జాలాలకి ఆహారం అయ్యేకన్నా
విడిపోదాం పద నువ్వటు నేనిటు
ఇంకో చెట్టుకి వేరయి పోదాం
మరో పుట్టకి మోడై పోదాం
మనం ఇలానే వుంటే ఎంతమాత్రం మనం
రాలిపోయిన ఆకులు ఎగిరి పోయినట్టుగా
ఎగిరిపోదాం పద ఎటో అటు
ఎండుటాకుల మీదయినా వెంటనే
సంతకాలు చేసి విడి పోదాంపద
ఇంకో చెట్టుతోనో మరో పుట్టతోనో
మన ఆగత జ్ఞాపకాలు పెనవేసుకుందాం
మాసింది మందు బ్రతికింది ఊరు అన్నట్టుగా
నీడే ఇచ్చేది చెట్టు తోడొచ్చేది నీడ అనాలిగా

అందుకని నీడల్నే వెతుక్కుంటూ పోదాం
నేటికో కొత్త చరిత్ర రాసుకుందాం
మన జీవితాలు దుర్వాస శాపగ్రస్తలు
ఎప్పుడూ బానిస నదిలో వలవల ఏడ్చేవే ఏడవనివ్వు
కష్టాలు జలజలమని ప్రవహిస్తూ పోయేవే పోనివ్వు
శునకరాజులు కనకపు సింహాసనాలు
అధిరోహిస్తారు ఎక్కనివ్వు
ఏకత్వం అంటే మనకి ఎప్పుడూ అర్థంకాని మాట
మన జాతికి పడని జడమైన తెగులు పదార్థం
ఐకమత్యం అంటేనే మనకి సరిపడని విషసంస్కృతి
గత చరిత్ర చెపుతున్న సత్యం అది.......
అసలే గ్రీష్మం
ఆపై అగ్ని గుండంగా మారిన వేరుకుంపటి రాజేసుకున్నాం
మనకి మనమే పేర్చుకున్న సమాజ పల్లేరుదారి
ఎవరికి తెలియని భాగోతం ఇది
అంతా స్వార్థ రాజకీయ సంరంభమే కదా

ఈ జ్వాలలమధ్య ఈ దుర్వాయువుల మధ్య
అగ్ని కీలమధ్య సందిగ్ధ సమరాల మధ్య
పెనం మీంచి కుంపట్లో పడడం ఎందుకు
ఇష్టంలేని మనువులు సాగించడం ఎందుకు
తనువులు చాలించడం ఎందుకు
కలలు దగ్ధమై పోయిన నేపథ్యంలో
మసి బారిన కళ్ళతో ఖండిత హస్తాలతో
ముండిత శిరస్సులతో స్వర్థ మనస్సులతో
ఈ చెట్టుమీద ఒకే కొమ్మమీద ఒకే రెమ్మకి
ఒకే పుష్పంగా వికసించడం ఎవరి కోసం
ఒకే దేహంగా శయనించడం ఎందుకు
ఇకపై కలసి కలలు కనడం



సహ వీర్యం కరవావహై అనడం
ఎవరు చెప్పిన ఉపదేశం ఇది
చెట్టుకొకరు పుట్టకొకరు చెల్లాచెదురైపోదాం
ఇంక ఇటు ప్రక్క ఏ వాల్మీకిరాడు
మనపై ఏరామాయణమూ వ్రాయడు
రాలిన ఆకులు గాలికి ఎగిరి పోయోలోగానే
మనం విడాకుల పత్రాల మీద సంతకాలు చేద్దాం
మన మధ్యలో మేరువులు ఎదిగి పోయోలోగానే
మరో నిషాదుడు ఇటు ప్రక్కన వచ్చేలోగానే
చితిపేర్చిబాణం
ఎక్కుపెట్టేలోగానే
ఏర్పాటు పత్రాలపై వేలు ముద్రలు వేసేద్దాం
నేటితో కొత్త చరిత్ర వ్రాయడానికి శ్రీకారం చుడదాం.





డా॥ వినోదిని

# ఎల్లమ్మ రాజ్యం

మొగుడూ పెళ్లాల్లో
అన్నా తమ్ముళ్లో
అవిభక్త కవలలో
కలిసుండటం కష్టమని తేలిపోయాక కూడా
వేరుపడటం వేర్పాటువాదమే అయితే
ఏ ఇల్లూ దానికి అతీతం కాదు

2
అవమానం నెత్తిమీద సూరీడై నిత్యం వెంటాడుతుంటే
ఎన్నుకున్న బ్రూటస్‌లు రోజుకో మాట మారుస్తుంటే
బతుకంతా కత్తిమొనల మీద ప్రయాణం
స్వతంత్రం ఎవడబ్బా సొత్తు కాదని తెలిసీ
ఇవ్వడానికి ఇవ్వకపోవడానికీ మధ్య
ఇంగ్లాండు లార్డుకీ
ఇటలీ రాణికి దోబూచులాట !



3
ఎవరో నరికి ఇస్తే తీసుకునే చెరుకుముక్కకాదు
తెలంగాణ...
చరిత్రలో పోరుకేతనాల విత్తనాలు నాటుకొని
త్యాగాల పంటల్ని సంచులకెత్తి పంపిన వీర మాగాణం
వల్లబాయిల వంకర బుద్ధెరుగక
త్యాగాల ఫలితాల్ని
పెద్ద మనుషుల దోసిళ్లలో పోసిన మంచితనం

4
వెంకటమ్మా...!
ఎంత కాదన్నా వెట్టిదానివి కదా!
ఉద్యమం వెనక వరసలో జెండా మోసే నువ్వు
ఎప్పుడైనా తెలంగాణాలో నీ వాటా గురించి ఆలోచించావా?
కారుల్లో తిరిగే పెద్దలకి
కాలినడకన తిరిగే నీ దుఃఖం లెక్కల్లో కొచ్చిందా ?

5
ఎల్లమ్మా...!
జాతరలో
వొడి నిండిన జోగినీవై
సిడెకు వేలాడిన తోలుబొమ్మవై
ప్రాణాన్ని దీపంగా గాలిలో పైకెగరేసిన నీ అవమాన భారం
ఎందరికో పండగై - కాసుల వర్షమైతే
ఊరు ఆనందంతో చప్పట్లు కొట్టింది సరే
ఏ ఉద్యమమైనా నిన్ను మనిషిగా గుర్తించిందా?
నీ కాళ్ల మధ్య వావివరసల్లేని యుద్ధరంగంలో
ఆయుధ విరమణ ప్రకటించిందా?
ఊరి దేవతవని పూజించిందా?

6

అంజిలమ్మా...!
మోకాళ్ల దిగని చీరకుచ్చిళ్లు ముడిచి పట్టుకొని
కుర్రవయస్సులో ముసలితనాన్ని మోస్తూ
వొంగి వొంగి... భయం భయంగా
పటేలు ఇంటివాకిలి దాటే నీ వెనకబాటును
వెట్టిలోనే మట్టయి పోతున్న నీ పూరెలుపలి
విలువకట్టని శ్రమనీ
ఉద్యమాల మొగమొనగాళ్లెవరైనా
రంగు అద్దాల్లేని నిజం కళ్లతో చూశారా?

7

మొగులమ్మా...!
కొత్త సంస్థానాల సెజ్‌ల రాజ్యంలో
నాకో ఆస్థానం దక్కడం మాట అటుంచి
ఉన్న కాసింత భూమీ పోకుండా మిగిలిందా?
కొత్త రాష్ట్రమైనా
కోల్పోయిన వాటికి కనీసం ఏమైనా హామీ ఇస్తుందంటావా?

8

అక్కా!
ఎక్కడయినా వరసలో చివరి వాళ్లం!
బంతిలో ఎంగిలాకులు ఎత్తడానికే తప్ప
విస్తరిముందు దర్జాగా కూర్చోనెరగని వాళ్లం!
అసెంబ్లీ మెట్లూ
పార్లమెంటు ముఖద్వారాలు
మన కోసం తివాచీలు పరచడం అటుంచి -
అప్పటి సాయుధ పోరాటగాడైనా
ఇప్పటి పౌరుషోద్యమ కారుడైనా



మన కోసం ఊరి గుడి తలుపులు తెరిపించ గలిగాడా?
భూముల పందేరంలో మన భాగం గురించి
నదీ జలాల యుద్ధంలో మన కోసం
దోసెడు నీళ్ల గురించి మాట్లాడిన నాయకుడున్నాడా?

9

ఒక్కరైనా మా కోసం లేనిచోట
ఏరొచ్చినా ఎద్దడే
చేను పండినా చేట అప్పే
మొగుడున్నా మొండిమెడే !
ఒత్తి దేబిరింపు బతుకులు !!
ఇప్పుడు మాక్కావలసింది
దొరల తెలంగాణాలు
పెద్ద కులమనుషుల ఆంధ్రలు కాదు...

10

దొరల్లారా...!
నాయకుల్లారా...!
మొదటిసారి నోరు తెరిచి అడుగుతున్నాం
ఇన్నేళ్లకు మాదీ ఒక డిమాండుంది
తెలంగాణా రావాల్సిందే!
ఎల్లమ్మ ముఖ్యమంత్రి కావాల్సిందే!





డా॥ జి.వి. రత్నాకర్

# ప్రజాస్వామిక సూత్రం

నేల అంటే పొలం అంటే
పొడవు వెడల్పు తూర్పు, పడమరలు
కావొచ్చేమో కానీ
రాష్ట్రమంటే ఉత్తర దక్షిణాలే కాదు
చావుపుటకలు కూడా
దుఃఖ సాగరాలే కాదు, సంతోష సంబరాలు కూడా
ఆదర్శ గ్రామం అన్నప్పుడల్లా
నాకు అంబేద్కర్, ఆయన నిరసించిన
కులతత్వం గుర్తొస్తుంది
రామరాజ్యం అన్నప్పుడల్లా
నాకు గాంధీ, ఆయన కీర్తించిన
వర్ణధర్మం గుర్తొస్తుంది
సమైక్యం అన్నది ఓ కుట్ర
సమైక్యాంధ్ర అన్నది మరో కుతంత్రం

మరి ఆదర్శాలు రామరాజ్యాలు
తెలుగు దేశాలు భాషలపై జరిగే చర్చలనేమనాలి
కంచికచెర్ల నుండి పదిరికుప్పం దాకా
కారంచేడు నుండి చుండూరు వరకు
జరిగిన నెత్తుటి చరిత్రల రక్తక్షేత్రాల్లోకి
ఐక్యతారాగాల లెక్కలు తేల్చండి
పడమటింటి ఓ కోర మోసం
కలిసుందాం అంటూ ఐక్యత గురించి
మా బాగా వల్లె వేస్తుంది
తూర్పింటి మరో దొరవారు
ఏకంగా హైదరాబాదు నాదే నంటున్నాడు
గోదారొడ్డున ఓ నూలుపోగు
నానేల పచ్చటి సీమ అంటా
నేలని నీళ్ళని తల్లి గోదావరిని పరిహసిస్తున్నాడు
సోదరా! సాగరాల్ని మోస్తున్న తెలంగాణా
నీళ్ళులేక అల్లాడుతుంటే
ఏటవాలున ఉన్న నువ్వు ఎన్నాళ్ళు
నీతులు వల్లిస్తావు ?
ఏరుదాటిన మాటలొద్దు
ఎదురీత గురించి మాట్లాడదాం
వదిలేసిన మూతిముంతలు వద్దు
కొట్టాల్సిన రాజ్యాధికార అగ్రకుల
కుంభస్థలం గురించి మాట్లాడుకుందాం
పోరాటంలో నీ నా జనం ఎంతో
లెక్కలేసుకొని వాటాలు పంచుకుందాం
దీనికోసం తలలు తెగాల్సిన అవసరంలేదు
చావు బాజాలు మోగాల్సిన అవసరం
అంతకన్నాలేదు
అందుకే మనం కలిసి మాట్లాడుకుందాం
అన్నదమ్ములుగా వంతులేసుకుని
విడిపోదాం
ఐక్యత అనేది ఓ కుట్ర
విభజన అనేది ఓ ప్రజాస్వామిక సూత్రం



సజ్జా వెంకటేశ్వర్లు

# తెలంగాణ వొట్టి నినాదం కాదు

మాట్లాడ కుండా ఉండనీకి
మాట్లాడకుండా చూడనీకి
గొంతు నులిమేస్తే మూగబోనీకి
అది చంటి బిడ్డ కాదు!
తెలంగాణ వొట్టి నినాదం కాదు!!

ఎందరు నిద్రపోతున్నా
మరెందరు నిద్ర నటిస్తున్నా
మేలుకున్న తెలంగాణను
ఎస్సార్సీ జగడాలాటలతో
రంగుల జెండాల దోబూచుల్లో
ఇంకెంత కాల మాపగలరు!

ఊరపెట్టనీకి అది ఊరకాయ కాదు
మాగపెట్టనీకి అది పచ్చి పండు కాదు
గోడమీది పిల్లి జపమూకాదు
కోసుకుమింగనీకి అది కోడి పుంజూకాదు!



అసమానతలకు తెరదింపనీకి
అంతిమ పరిష్కార స్వప్న స్వరూపం
అదివొట్టి మాటల నినాదం కాదు
అది రక్తమాంసాలున్న అగ్ని సరస్సు!

అక్కడ సమస్యే రాజకీయమో
ఇక్కడ రాజకీయమే సమస్యో
ప్రజల ఆకాంక్షలను పాతర పెడుతూ
ఓట్లాటగా మార్చేసి తలోదిక్కుచేరి
బంతాడగా తంతుంటే
బాధపడే నేల మూలుగుల్లోంచి
తెలంగాణ జన సముద్రం లోంచి
సునామీలై ఉనికికోసం పోటెత్తాల్సిందే!





కోయి కోటేశ్వరరావు

# రాజ మకుటం

భూమి గుండెలదిరేలా
'ధూమ్‌ధామ్'ల్లో
చిందేసే ఆదినర్తకులెవ్వరు...?

నింగి చెవులు మారుమ్రోగ
'పోరు పాట'ల్లో రాగాలయిన
పరమగాయకులెవ్వరు...?

అగ్ని జ్వాల కంపించగ
ఆత్మాహుతికి తనువులిచ్చే
అమరమూర్తులెవ్వరు...?

నీటిచెలమలై ఉరికి
ఉద్యమ దాహం తీర్చే
జీవ ధార లెవ్వరు...?

గాలి హోరు నెదిరించి
వైతాళిక పతాకలై గర్జించే
ధీరయోధులెవ్వరు...?

పంచభూతాల్ని
పిడికిట్లో బిగించి
కాలాన్ని ప్రశ్నించే
అసమాన వీరులెవ్వరు?

వారిదే లే తెలంగాణం !
వారిదేలే రాజమకుటం!!





డా॥ దార్ల వెంకటేశ్వరరావు

# మీబాటలోనే మాదిగోళ్ళూను...!

మీలాగే మేమూ మాకు రావాల్సినయన్నీ మాకియ్యమని
మా సోదరుల్తో పోరాడుతున్నోల్లమే నండి
బతుకు తెరువెతుక్కొంటూ
కడుపుకి కూసింత గెంజి కోసం వచ్చినోల్లమే నండి
మేమేమీ వోమనుదు లాంటోల్లం కాదులెండి
మీయధికారాన్ని గుంజుకోవడానికో
తెల్లోడోలె పెత్తనం సెలాయించడానికో
రియలెస్టేట్ యాపారం సేత్తూ
మీభూములన్నీ లాక్కోడానికో వచ్చినోల్లం అసలే కాదండి
అందర్లా మీరూ మమ్మల్నీ అనుమానంతో సూసినా
అప్పుడపుడూ మీరే సెప్పుతుంటార్లే మీ సెత్రుత్వం మాతోకాదని!
మొన్నటిదాకా మనదంతా ఒకటే బాసంటే
అచ్చరాలా నిజమేననుకున్నామండి
మొన్నటి దాకా మిమ్మల్ని మాట్టాడించినప్పుడల్లా
మాకెందుకో నవ్వొచ్చేసేదండీ

ఆయ్... నిజ్జంగానండీ
రౌడీలు, దొంగలూ, బఫూన్లతోనే మీ బాసలో మాట్టాడిత్తున్నారని
నిజ్జంగా మాకప్పుడు తెలీదండీ... ఆయ్!
యీమద్దె మమ్మల్నీ అలాగే మాట్లాడిత్తుంటే
మాకు తెలిసిందండి
మా బాసనేదో అబాసుపాల్జేత్తున్నారని
మా బాసతోనే మమ్మల్ని యేలనజ్జేత్తున్నారని
మా బాసతోనే మమ్మల్ని సంతలో అమ్మేత్తున్నారని !

* * *

మీకూ మాకూ సేలా యిసయాల్లో పోలికలున్నాయండి
నిజ్జానికి మనద్దిరిదీ 'ఉమ్మడి' తెచ్చిన గొడవేనండి
మనిద్దరమిప్పుడు
'జాతీయని' బందంలోనే శిక్కుకుపోయామండి
రాజ్జెమైనా, రాజ్జాంగెమైనా, పెజల గోసినాల గందా
మాకులపెద్దోల్లే నయమేమో
కొత్త కల్లోసారో తాగేసి అటో యిటో తగువు తేల్చేత్తారండీ
యీాల్లేంటండీ... మావూల్లో అమ్మోర్లా
అన్నీ సెప్పినా అర్థం కానట్టు
పెద్దపెద్ద కల్లేసుకొని మిడిగుడ్డుల్తో సూడ్డమే తప్ప
పెదాల్నిప్పట్లేదేంటండీ?

* * *

బాసాపెయత్తనం గానో, ఉమ్మడి సెద్యాలు గానో
గారడీవోల్లు, యేయో విద్దెల్తో మాయల్నే సేత్తున్నారు సుమండీ!
యెవల్లోకో యెప్పుడో యిచ్చిన వరాలే మాకిప్పుడొరకత్తులవుతాయని
మేమెప్పుడూ అనుకోలేదండి
ఆయ్.. ఆ కత్తులకోత నిజ్జంగా మాకిప్పుడిప్పుడే తెలుత్తోందండీ

మీకూ మాకూ అన్నేయం జరుగుతుందని
మాకూ ఇప్పుడిప్పుడే నిజ్జంగా తెలిసొత్తందండి
ఆయ్... యింకా సెప్పాలండీ మాదీ గోదారి జిల్లానే నండీ
గోదారోల్లంతా గోదాల్లా బొజ్జలు పెంచుకున్నోల్లే కాదండోయ్
మమ్మల్లందర్నీ చేరదీసి కిరస్తానీ వోల్లు
సదువూ సంస్కారం నేర్పారంటారే
ఆ దలితులనే మమ్మల్నీ పిలుత్తుంటార్లెండి
సెప్పేదేముందండి
చెప్పులు కుట్టుకుంటూ యే రోడ్డు మూల్లోనో తప్ప
సదువుకుని సర్కారు కొలువులోవున్న
మా మాదిగోల్లెక్కడున్నారో మాకొక్కడూ కనబడ్డండీ!

* * *

ఇసాలాంధ్రలో ఇసాల భావాలెక్కడున్నాయని
మీరెతుకుతున్నట్లే
మాల మాదిగోల్లంతా యెక్కడొక్కడో
యిల్లల్లోనో పెల్లిల్లోనో సివరికి సొశానెంలోనైనా
యెక్కడైనా ఒక్కటై కనిపిత్తారేమోనని యెతుకుతున్నామండి
మీక్కనిపించినట్టే
మాకూ నేతిబీరకాయలో నెయ్యేదొరుకేత్తందండి!







మంచికంటి

## ఆవిష్కరణ

రోజులకు రోజులు పనిలో మునిగి తేలేవాడెప్పుడూ
చేతులు కట్టుకుని నడుంవంచే నిలబడతాడు
నంగి నంగిగా మాట్లాడుతూ
వంగి వంగి సలాములు చేస్తుంటాడు
అయిన దానికీ కాని దానికీ అదిరదిరి పడుతుంటాడు
తన నీడను చూసి తానే భయపడుతుంటాడు
కష్టం చెయ్యడానికే భూమ్మీద పడ్డాననుకుంటాడు
ఎవరి దయాదాక్షిణ్యాల మీదో బతకాల్సిందేననుకుంటాడు
కాళ్ళతో నడిచే వాణ్ణి కూడా వీపుకెత్తుకుమోస్తాడు
చెయ్యని తప్పులకు చెప్పుదెబ్బలెన్నో తింటానంటాడు
తనకింతే దక్కుదలని నొక్కినొక్కి చెప్పుకుంటాడు
ఆదమరిచి నిద్రించేటప్పుడూ వీపు తట్టుకు ధైర్యం చెప్పుకుంటాడు

దోపిడీతో దోచుకునే వాడెప్పుడూ
దర్జాగా పట్టుపరుపులపై పవళించే ఉంటాడు
తల ఆకాశపు హర్మ్యానికి ఆన్చి
నేలవైపు చూపులు సారిస్తాడు

అవసరమున్నా లేకున్నా
అప్పుడప్పుడూ గుడ్లెర్ర జేస్తుంటాడు
ఎప్పుడైనా ఖాళీ కొరడాని
చేతిలోకి తెచ్చుకుని చెళ్ళుమనిపిస్తుంటాడు
ఎప్పుడూ ఇటుపుల్లతీసి అటు పెట్టనివాడు
చెమటై కారిపోయేవాణ్ణి చెమ్డాలు తీస్తానంటుంటాడు

అణిగిమణిగిన వాణ్ణి అణిచేస్తున్నప్పుడు
ఎవరైనా సరే నిలబడ్డ నేలెవరిదో తెలుసుకుంటారు
ఎవరి వాటా ఎంతో తేల్చుకుంటారు
తమ వీపుపై ఎక్కి ఎవరెవరో స్వారీ చేస్తున్నప్పుడు
తమ చెమటతో ఎవరుదాహం తీర్చుకుంటున్నారో తెలుసుకున్నప్పుడు
కళ్ళల్లో చింత నిప్పులు కురిపిస్తారు
చూపుల్లో మెరుపులు మెరిపిస్తారు
సొంత చేలోనే పరాయి బతుకులీడుస్తున్నప్పుడు
మాటలు చురకత్తుల్లోకి తర్జుమా అవుతాయి
చేయి చేయీ కలిసి సమూహమౌతుంది
నిలబడ్డ చోటే ఆందోళన చిగురిస్తుంది
కాళ్ళు కదనరంగమౌతాయి
పరాయిదైపోయిన నేలపై సొంత జెండా పాతుకుంటుంది







డా॥ చల్లపల్లి స్వరూపరాణి

## పుష్య 'మిత్రులు'

ఏ జెండా పట్టినా
మన ఎజెండా ఒక్కటేనన్నావు
ఎంత ముద్దొస్తున్నావురా అబ్బీ!
తెలంగాణా మన పరగణా
తెలుగు వాళ్ళంతా మన పాలేర్లు
బడుగులు మన బోయీలు
పిడికిట్లో దొరతనం
చేతివేళ్ళ సందుల్లోంచి జారిపోతున్నట్టుంది
తాతల నాటి కర్రపెత్తనం
నడ్డివిరిగి పోయేట్టుంది
ఒక్కొక్కడు కట్లు తెంచుకుపోతున్నాడు
వాడి పెడరెక్కలు విరిచి
సమైక్య చావిడి గుంజకు కట్టెయ్
హక్కుల వూసెత్తిన వాడిని
ఐకమత్యం తాడుతో వురితీయి
జనం గుండెలు భగ్గుమన్నా ఫర్వాలేదు
ఈ రాష్ట్రం ముక్కలు కానివ్వకు



డా॥ నూకతోటి రవి కుమార్

# ప్రజా యుద్ధం

వీరుల కలని
విదూషకులు అపహాస్యం చేస్తున్నప్పుడు కూడా
మాట్లాడని ప్రజల గురించి చింత ఎందుకు ?
పోరు బిడ్డల ముఖాల మీద
పిరికి పందలు పేడ ముద్దలు విసరడాన్ని చూస్తూ కూడా
నినదించని జనం ఊసు మనకెందుకు ?
మృతవీరుల స్వప్నాల మీద
పిచ్చి గీతల్ని గీసి
మేనిఫెస్టోగా వెల్లడిస్తున్నప్పుడు కూడా
పిడికెళ్ళు బిగించని జాతుల గురించి కబుర్లెందుకు?
నేస్తమా! కల ఇంకా పగిలిపోలేదు
ఇక్కడి నేలంతా చిత్తడిచిత్తడిగా ఉన్నప్పుడు
గాయాలు పచ్చి పచ్చిగా సలపరిస్తూనే ఉన్నాయి
ఒకటా రెండా లక్షలాది త్యాగాలు
వేలాది అమరత్వాలు పెనవేసుకొని నిలిచున్న యోధ తెలంగాణ
చరిత్ర మీద చెత్తనాయాళ్ళ స్వప్నాలకు



ప్రస్తుతం కాపల కాస్తోందనుకుంటున్నారేమో
రేపటి మహా సునామి కోసం
మౌనం దాల్చుతున్నారిపుడు
జన తెలంగాణ కోసం
జాగారం చేస్తూన్నారిపుడు
కలతలొద్దు! కన్నీరొద్దు! బిడ్డా!
కాలం కత్తులవంతెన మీదనుంచి దూకి
ఐలమ్మల వారసత్వం ఉరికి వస్తానంటుందిపుడిక
నవ తెలంగాణ
జన తెలంగాణ
వీరుల తల్లి
విప్లవాల మల్లి
ప్రజాయుద్ధానికి సిద్ధం కండి?





కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి

# తెలుగుభాషా సమైక్యతారాగంగా సాగిపోదాం

ఆ... మనిద్దరం
వేరు వేరు ఆకాశాలమన్న
మనోభావాల్లో సుడివడిపోతూ
ఒకే భాషా చట్రం కింద వొదిగొదిగి
బతుకీడుస్తున్న వాళ్ళం
ఎవరికి వాళ్ళ హృదయాల్లో పరాయితనాన్ని మోస్తూ
ఉప్పు నిప్పుల్లాంటి వొద్దికతో
విశాలాంధ్ర నీడలో ఒకటిగా నడుస్తున్న వాళ్ళం
అధికారం హస్తగతం కోసం
రాజకీయాల చేతుల్లో
పావులమై కదులుతూ
ప్రత్యేక రాష్ట్ర నినాదాలమైపోతూ
అధికార దాహంతీరాక
నీళ్ళు చల్లిన నిప్పుల్లా చల్లారి
కరబొగ్గులమైపోతున్న వాళ్ళ
అమాయకంగా కష్టాల్లో జోగుండే



నీ నైజాం నైజాన్ని ఎరిగి
తెలివిగా వ్యాపారాల్లో విస్తరిస్తూ
మా ఆంధ్రావిశాలాంధ్రైపోయిందా
మీ ఇళ్ళల్లో వేళ్ళూను కోవడమే కాకుండా
మీ కళ్ళల్లోకి వేళ్ళు పాకించటంతో
విడిపోవాలని మీరు
గమ్మత్తుగా కలిసుండాలని మేము
కుళ్ళు రాజకీయంలో కుదేలవుతున్న వాళ్ళం
ఇకనైనా...
రాక్షస రాజకీయ హస్తాల్లోంచి విముక్తులమై

యదార్థాల్లోకి ఇంకిపోదాం
గాయాలను కెలుక్కుంటూ ఎగిరెగిరి పడటంకంటే
తీయని జ్ఞాపకాల్ని నెమరు వేసుకుంటూ
సోదర భావనా రేఖ కింద
చెరో సంతకంగా విడిపోదాం
తెలుగు భాషా సమైక్యతా రాగంగా
సాగిపోదాం





ఇ.వి.

# ఆడా మేమే - ఈడా మేమే

అయ్యా... దొరా....
నీకాల్ మొక్త
తెలంగాణ తెస్త.... తెలంగాణ తెస్తని
.... నువు అంటుంటే
నీ బాంచెన్... యానాదోన్ని...
నా కస్సలు సమజైతలేదు
ఎవరి తెలంగాణో తెలియక
బుర్ర గ్రోక్కాని సత్తన్న
14 ముక్కలుగా నరకబడిన
నాసెల్లి బెల్లిలలిత
మాంసం ముక్క కసికొద్ది
నిలదీస్తంది
వసివాడని పసిబిడ్డల
నెత్తురు తడిసి నేల
గొంతెత్తి అరస్తంది
ఎవురి తెలంగాణా తెస్తవని
అయ్యో...
సామి.... కాపా....



నీకు దండంపెడతా
సమైక్యమో సమైక్యమో అని
సిందులేత్తన్నవ్
సమించాల... యానాదోన్ని
నాకు తెలవకడుగుతున్నా
యాడుంది కాపా సమ.... ఐకం
కారంచేడు మాదిగోల్లను
కమ్మోల్లు ఖసిఖసిగా నరికినపుడు
యాడుంది సామి సమ...ఐకం
సమించాల... యానాదోడ్ని
తెలియకడుగుతున్నా...
సుండూరు మా.... మాలోల్లను
ముక్కముక్కలుగా తెగ... నరికి నపుడు
ఏస్సందులో దాంకుంది... కాపా
నీ... సమ ఐకం
వాకపల్లిలో నాగిరిజన
అమ్మని, అప్పని, తోడబుట్టినదాన్ని
సెరిసినప్పుడు
ఏ ఆసామి సంకెనెక్కి కూసుందయ్యా
నీ... సమ ఐకం
తెలంగాణలో ముక్కలైంది మేమే
నీ సమ ఐక్యంలో సచ్చిందీ మేమే
ఆడ మేమే
ఈడ మేమే
అందుకే... ఓ ... దొరా
అందుకే ఓ సామి
ఎప్పుడూ.... యాడ.... అరవనోడ్ని.... యానాదోడ్ని
ఇప్పుడు గొంతెత్తి అరవబోతుండ
ఆడ తెలంగాణ మా అలగాజనానిదే
ఈడ ఆంధ్రా మా అలగాజనానిదే
ఆడ మేమే
ఈడ మేమే





జుగాష్విలి

# నీ వెంటే... నీతోనే...

తెలంగాణ ఒక ఓటు
తెలంగాణ ఒక సాకు
తెలంగాణ ఒక ఆటవస్తువు
తెలంగాణ
పార్లమెంటరీ పార్టీల చేతిలో ఓ తురుపు ముక్క
ఎత్తులూ పొత్తులూ పొత్తి కడుపులో పిడిగుద్దులూ...
బంగారు సింహాసనాల మీద జెండాలు మారడం
ఎన్ని దశాబ్దాలుగా చూస్తున్నాం

నందిగ్రాం నుంచి ముదిగొండదాకా
సింగూరు నుంచి పోలేపల్లి దాకా
పాలకుల అసలు రూపాల్ని విప్పి చూపుతున్నాయ్

డిసెంబర్ తొమ్మిది రెండు వేల తొమ్మిది ఎంత మంచి రోజు
ఎందరెందరివో
పెట్టుడు ముఖాల పెచ్చులూడి
చిదంబర రహస్యం బట్టబయలైంది

రాత్రికి రాత్రే గోడమీద పిల్లులు కొన్ని
మద్దతు మాస్క్‌తో ఛానళ్ళనిండా కనువిందు చేశాయి
శ్రీకృష్ణ కమిటితో అవన్నీ తెరవెనక్కి చప్పున జారుకున్నాయ్



పెట్టుబడి
ఎక్కడైనా, ఎప్పుడైనా
పార్టీలకు, కులాలకు, ప్రాంతాలకు
అతీతంగా ఒక్కటవుతుందని
కల్పిత ఉద్యమాలు మనకు తెలిసిన దాన్నే మళ్ళీ చెప్పాయి

తెలంగాణా తెలంగాణా
రాజ్యం కౌటిల్యం గురించీ క్రౌర్యం గురించి నీకు అనాదిగా తెలుసు
దాన్ని నిబ్బరించి నిలవడమెలాగో
నీకు తెలిసినంతగా మరెవరికి తెలుసు?

నీ ఆకాశం కింద, నీ నేల మీద
నీ వానలో నువుతడిసి
రెక్కలు విప్పుకొనినాట్యమాడాలి
స్వేచ్ఛలోని అందమూ ఆనందమూ గురించి
పోరాటమూ దానిలోని ఆటుపోటుల గురించి
ఇప్పుడు నీకెవ్వరూ కొత్తగా చెప్పక్కర్లేదు
నీ మరోపేరు పోరుగడ్డని చిన్నప్పుడే చదువుకున్నాను

ఇవాళ
మా అలిశమ్మ అయిలమ్మతో చేయికలిపింది
మా కంచికచెర్ల కోటేశు కొమరయ్య బాట పట్టాడు
పాట చిక్కనై పదునెక్కి నీతోనే నడుస్తుంది
వెంటాడే కలాలు నీతోనే, నీవెంటే వుంటాయి ఎప్పుడూ...

రేపటి తెలంగాణ
దళిత బహుజన ఉద్యమాల విజయకేతనం

- చిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట : దళిత బహుజన కవుల కవితా సంకలనాలు
- వెంటాడే కలాలు : బి.సి. కవుల కవితా సంకలనం





కలేకూరి ప్రసాద్

# నువ్వే నేను

మునేటి వంక దగ్గరో
జోదు చింతల మలుపులోనో
నువ్వు నాకు ఎదురుపడ్డ జ్ఞాపకం
అప్పుడు నీ కళ్ళనిండా నీళ్ళు
నిన్ను గుర్తే పట్టలేదు

గొరికొయ్యలు పొడిచినప్పుడో
తెలి మబ్బులు విరిసినప్పుడో
నువ్వు మా గుడిసె కొచ్చినట్టు జ్ఞాపకం
అప్పుడు నేను ఆవురావురుమంటూ
ఆకల్ని భోం చేస్తున్నాను...
నిన్ను నేను చూడనేలేదు
ఎవరి అసహనమో
ఎవరి ఆగ్రహమో
జంటపేగుల మధ్యన



కనిపించని కలుషితరేఖల్ని గీసింది....
రాజమార్గాన మారాజులా
నడిచి పోవాలన్న తరాల పిచ్చికోరిక
దింపుడు కల్లం దగ్గర చిల్లరగా
గలగలా జారిపోయింది
ఎందరు కుప్ప కూలిపోయారు!
ఎందరు నలిగిపోయారు?
కనురెప్పల కింద
గాయాలసుడిగుండాల్లోపడి
తన్నుకు లాడుతూ
నీ సంగతే పట్టించుకోలేదు
నన్ను ఊరవతలకినెట్టి
కలల్ని రక్తసిక్తం చేసిన
ఆ వామనుడి మూడోపాదం మోపింది
నీ శిరస్సుపైనే
నంగిమాటలు లేవు
భూమిని పెకలించుకొని
శిరసెత్తి నిలబడు
చెంగనాలు తొక్కు
తాండవమాడు
ఆడినా పోరాడినా ఓడినా
నీది ధర్మపోరాటం
నీ రణ క్షేత్రానికి
నా శ్వాసను కాపలాగా పెడుతున్నాను
హద్దులే ఏర్పడతాయో
సరిహద్దులు లేని
మానవీయ పరిమళాలే వ్యాపిస్తాయో

కదం తొక్కు
కదం తొక్కు
నీ నడకల తాళానికి
దొంగల కోటలు బీటలు వారాలి
ఆకాశం చిరిగి
జలధారలు కురవాలి
పగిలిన నీ పెదవులపైన
చిరునవ్వుల పువ్వులు పూయాలి







పసుపులేటి గీత

# కలి'విడి'పోదాం

మనల్ని మనం అర్థం చేసుకోవడానికి
ఎన్ని వేల పదాలు కావాలింకా?
బోల్డ్ ఫాంటులో గట్టి గట్టి నినాదాల్ని
ఒకళ్ళ మీదికి మరొకళ్ళం విసురుకుంటాం

పిసలైన పక్షుల రెక్కలు విరిగి పోయాక
బాష్పవాయు గోళాలకి రెక్కలు మొలిచాయి
వణుకుతున్న నీడల గొణుగుడు మాత్రమే వినిపిస్తుంది
పదాల విపణిలో ఏ రూపకాలంకారమూ యుఎస్పీ కాలేదు
వీధులన్నీ దాటుకున్న గాడిపొయ్యిల పొగదారుల వెంట
గాలి కిటికీల చువ్వల మీద సాలీళ్ళయి అల్లుకుంటున్నాం
పిట్టపోరు పిట్టపోరు తీర్చడానికి అతనెప్పుడూ సిద్ధమే
గోడమీద పిల్లి కుహనా పోరాటాల్ని కంటూనే ఉంటుంది
నిప్పు పుండేదో సలుపుతున్నట్టు
నేను సమస్యల గుట్ట మీద
తుమ్మల్లో పొద్దు గుంకుతాను

నీ వాటా నువ్వడుగుతావు
మూడు ముఖాల సియామీ కవలలమంటాడతను
నీటి తానులో ఏ ముక్క ఎవరిదో లెక్క తేలదు
అతని జేబులోని నోటు తాను కత్తెరకి లొంగదు
టీవీ చానెళ్ల పొగగొట్టాల్ని దాటి, కరపత్రాల గోడల్ని దాటి
ఫ్లోరోసిస్లో వంగిన కాళ్లు, ఫైరాయిడ్తో సలపరించే గొంతుకలు
ఎండు చేపల్లాంటి దేహాలతో విఎఫ్ఎక్స్ సోకినట్టు
మనిద్దరం ఎదరు బోదురుగానే తిరుగుతుంటాం
నీ నీడ కింద నీ డొక్కలెండిన పాలమూరు నాకు కనబడదు
నీ కంటికి అతనూ, నేనూ అంతా ఒక్కటే
కానీ నా కంటికి నువ్వు నా పక్కటెముకవే
మనమిలాగే మూసిన కిటికీల అవతల
అసూర్యంపశ్యలుగానే మిగిలిపోతాం
ఈలోగా...
మన సొంత పడకల మీదా, నడివీధుల్లోనూ
చిట్టచివరికి ఒక హత్య జరుగుతుంది
గాజు డైల్ కింద శూన్యక్షణాలు
రోజుల్ని ప్రసవిస్తాయి
వేళ్ళని విఘడియల్లో దాచి
గోడల మీదా, మణికట్ల మీదా
రోజులు సంవత్సరాల గ్రాఫిటీల్ని రాస్తాయి
క్రీస్తుశకపు రోడ్ల మీద ఎప్పట్లాగే
పన్నెండో మూలమలుపు దగ్గర అందరం ఏకమవుతాం
కానీ అతను మాత్రమే మిట్టమధ్యాహ్నమవుతాడు
అతను మాత్రమే నడిరాత్రవుతాడు
అతను మాత్రమే కాలానికి ఆ'లంబ'నమవుతాడు
అతను మాత్రమే నీదారికి దిక్సూచి అవుతాడు



నువ్వు ముందే నడుస్తున్నా
పాండురోగి ముఖాలేసుకుని గడియారాలన్నీ
అతని కోసమే నినాదాలవుతాయి
తల్లి స్తన్యంలో పాలవిరుగతను
అతనితో పాటు నేనూ నీ వెనుకే నీ ముందుంటాను
అతని ఆక్టోపస్ పాదముద్రల వెంటే
మన ఎడారి పాదాలకి సదుల సిండ్రెల్లా షూల్ని తొడుగుతాడు
ల్యాంకో నివురు కింద నువ్వు నిప్పవుతావు
అనుమానం మొగ్గతొడిగితే
మొగ్గలోనే తుంచేయాలి కాబట్టి
నీ క్యాంపస్ మీద అతను లాఠీ అవుతాడు
నేనూ నా వంతు వీపుని లాఠీకి అప్పజెబుతాను
పగిలిన రాళ్ల పొత్తిళ్లలో బీటలు వారిన కండరాల్ని
కలిపికుట్టుకుంటూ గుక్కపట్టిన నిన్నూరడించడానికి
నిషేధాజ్ఞల లాలిపాటలో నీకు నువ్వే ఇన్సోమ్నియావవుతావు
పొలిటిక్స్, పోలెమిక్స్
ప్రణతంత్రపు రీమిక్స్
అతనొక ముళ్లులేని గడియారం
మానిటర్ లేని కంప్యూటర్
డెడ్ఎండ్లో ట్రాఫిక్ ఐల్యాండ్
డొల్లలోపలి మాలోకి, మాలోని డొల్లతనంలోకి
వేళ్ళ వరదవై ఉప్పొంగే నిన్ను చిగిర్చి
నన్ను నేను చీరుకుపోతానిక
మట్టిలోని వేరుకి ఎగిరే పిట్ట కనిపించక పోవచ్చు
తొలకరినల్లే మబ్బుచేతులు అందక పోవచ్చు
వేకువనల్లే కిరణాల జాడ దొరకక పోవచ్చు
కొండగాలి దారులన్నీ అపరిచితం కావచ్చు

కానీ నువ్వు రేకుల దిగంతాల్లో పరిమళాల జాతర్లయ్యే
పూల కొంగులో పుప్పొడి రూకవవుతావు
అందుకే, మట్టికొమ్మల్లో నిన్ను నువ్వు నాకంటుగట్టుకుని
నాలోకి గుప్పెడు కొత్తవేర్ల ఉత్పాతానివికమ్మంటున్నాను
నేనిక నీనుంచి గుంభనంగా సెలవడుగుతున్నాను
ఇది 'కన్వెషన్' కాదు, 'కన్వర్జెన్స్' మాత్రమే!
చిన్నా, పెద్దా ముళ్ళలోని పీటముడిని విప్పి
కాలం కూడా కానలేని ఫిఫ్త్ డైమన్షన్‌లోకి
కాస్మిక్ ఈక్విలిబ్రియమ్‌లోకి
అనూదితమవుదాం
పొందే లాభమనలేను, నువ్వు లేక మనలేకున్నా
కలి'విడి'గానే విరబూద్దాం!







షేక్ కరీముల్లా

# మోదుగు పూలు

ఒక స్వప్నం
అన్ని విషాదాలనూ భరిస్తూ
అవనతం కాని జెండాలా
దశాబ్దాలుగా ఎగురుతూనే వుంది
గాయం భాష గాయానికే
అర్థవంతంగా అర్థమౌతుందన్నట్లు
నెర్రెలిచ్చిన నేల గొడవ
తెలంగాణా వాకిలి తెరిచిన
చెమ్మగిల్లిన గుండెకే తెలుస్తుంది
చెరువు గట్టుపై మోదుగుపూలు
అల్లంత దూరం నుండి విన్పించే
నీటి చెలమల సంగీతానికి విచ్చుకుంటూ
చలిని జయించిన నిప్పుల దప్పులై
ఖణేల్ ఖణేల్ మని మోగుతుంటే
అవి కప్పల బెక బెకలని
పెత్తం దారుడా! ఎన్నేళ్ళు సూత్రీకరిస్తావ్

చెవిటి వాడిలా
మూగవాడిలా
పుట్టు గుడ్డివాడిలా
ఎందుకలా నటిస్తావ్!
నువ్వు పురుటి బల్ల ఇవ్వనంత మాత్రాన
పురుటి నొప్పులు ఆగవు
వాలు తనం లేదని
దూకే జలపాతం నిమ్మళించదు
ఇప్పుడిక అక్కడి నెమళ్ళకు
పురివిప్పి నాట్యం చేసేందుకు
చుక్క రాల్చని మేఘంతో పనిలేదు
అగ్ని చెప్పులు తొడుకున్న పాదాలకు
ఇక కాలిబాటల అవసరం రాదు







సరికొండ నరసింహరాజు

# మట్టి పాట

ఒకనాడు పాటంటే అమృతం !
నిన్న పాటంటే ఆయుధం !
నేడు పాటంటే ఆలోచన !!

ఒకప్పుడు పాట ఝుంఝూ మారుతం...
నేడు పాట... ఆకురాలు కాలంలో
కూసే వెలి కోయిల స్వగతం !

పాటంటే పాటా... అది
పరిమళించే చెమట గంధం
కన్నీటి చుక్కలో విరిసిన హరివిల్లు అందం
* * *
వేదనలే వేయి స్థంభాల గుడై
నేడు పాటలు మట్టి బతుకులను పల్లవిస్తున్నాయ్ !
నల్ల గొంగళి సైతం గాంధీ గిరి చేస్తున్న నేపథ్యంలో...
అహింసాయుధం చేతబట్టి

భూమి పోరుకు సిద్ధమైన మట్టి మనుషులు...
పాటల తుపాకి దేహంలో తూటాలూ...
పాలకుల కంట దీపాలు వెలిగిస్తున్నాయ్!
నేతలకు అతడొక గొంగళి కప్పుకున్న పురుగేమో?
నాకు మాత్రం పాటకు గొడుగు పట్టిన పాలేరు...
ఇక... మనమందరం 'పాటశాల'లో నిత్య విద్యార్థులం
జత కలిపిన గొంతుకలం!
రగిలే అశాంతిపై మితవాదుల శాంతి యాత్ర...
తెల్లదొరల పెట్టుబడిదారీ వ్యవస్థలో
తెలివైన దోపిడీకి నిరసనగా...
'ధూం... ధాం....' అంటూ పాటల ధూపం వేస్తుంటే
మూడో నేత్రమైనా ముచ్చటగా దీవించాల్సిందే!

వెట్టి బతుకుల విముక్తికై మట్టిపాట
గజ్జెకట్టి వేల చరణాలతో చిందులేస్తుంది !

ఉద్యమాల ఖిల్లాపై శాంతి పావురాలెగరేసినా...
వేటగాళ్ళ ఉండేలు దెబ్బలకు నేల రాల్తూనే ఉన్నాయ్

పల్లవులను చరణాలను విడగొట్టాలని
పాటను వేలం పాటేయాలని...
పాటను నరకాలని విశ్వప్రయత్నం
పసులకాపరుల చీకటి గాయాలన్నీ.. వేకువ రంధ్రాలై...
వేల వేణువులు పాటను మోస్తుంటాయ్ !

ప్రాణం పోస్తుంటాయ్!

"అధికార వికేంద్రీకరణే అన్ని విధాల అభివృద్ధి" అన్న నోళ్ళే...
రెండో ఎస్సార్సీ అంటూ మొసలి కన్నీళ్ళు కారుస్తున్నాయ్!
తెగిన బతుకులు సైతం



తమ తీగలను తామే సవరించుకుని ముడేసుకుంటున్నాయ్!
పాట నాదమై - ఖేదమై...
బహుళ గీతమై... యుగళ గీతమై...
నేపథ్య సంగీతమై... బృందగానమై...
పాటల పాయలు జడలల్లుకొని
ప్రవహిస్తూనే వుంటుంది!
గళాల్లోంచి... కలాల్లోంచి...
కుంచెల్లోంచి... మంచెల పైనుంచి...
'సమ్మక్క సారక్క' జాతరల్లోంచి -
మానవ హక్కుల పాతరల్లోంచి
చిర్రుల్లోంచి... చిందుల్లోంచి...
జనపదాల్లోంచి... జానపదాల్లోంచి... బతకమ్మ పండగల్లోంచి...
నీటి కోసం కుట్రల్లోంచి... భూమికోసం కుతంత్రాల్లోంచి
యురేనియం కందకాల్లోంచి
ఫ్లోరోసిస్ బతుకుల వైకల్యం లోంచి...
నాయన యాదిలోంచి.... మాయమ్మ కట్టుబొట్టు లోంచి...
కాలి కడియాల్లోంచి... కావడి కుండల్లోంచి
దొరతనం వంచనలోంచి... 'బాంచెన్‌దొర' బతుకుల్లోంచి
యాసలోంచి... బాసలోంచి....
సాగి...సాగి... కొండలు... కోనలు...
వాగులు... వంకలు... మీదుగా
పాట సజీవ ఊటై ప్రవహిస్తూనే వుంటుంది!

నేలంతా పరుచుకున్న పాట...
సముద్రంలో కలవని జీవనదౌతుంది!
బీడు భూములను సస్యశ్యామలం చేస్తుంది!
భూదానోద్యమాల నినాదమౌతుంది!
పురుడు పోసుకున్న పాట -
వేలాది బిడ్డలకు 'అమ్మ' ఔతుంది !

పాటల పిలకలను పీకేస్తున్నా
గుండె గుండెలో మొలకెత్తుతునే వుంటుంది
మంత్ర దండాన్ని ప్రశ్నిస్తుంది!!
వేళ్ళూనుకున్న మర్రి ఊడలను పెకిలిస్తుంది!
"ఒంటెగుడారం" సామెతలను ఖండిస్తుంది!
మేధావులను నిలేస్తుంది!

పాట, మట్టి పాదాల మీద పుట్టుమచ్చలై
నిర్విరామ శ్రమ గీతమౌతుంది.
డప్పుల మోతల్లో కదం తొక్కుతుంది
పాటకు పశువులైనా తలలూపాల్సిందే!
పాలకులైనా తలవంచాల్సిందే !

నల్ల దొరల బానిసత్వం నుండి
దళితుల స్వరాజ్యానికి బాటలు వేస్తుంది!
పెత్తం'దారుల' నుండి
పేదల రాజ్యంగా ఆవిర్భవిస్తుంది!

సామ్రాజ్యవాద దోపిడి నుండి
సామాన్యుడి రక్షణకై
స్వాతంత్ర్యోద్యమ దిశగా సాగుతుంది !







డా|| రాచపాలెం చంద్రశేఖర్‌రెడ్డి

# ప్రశ్న

ఏవేం...
భూసంస్కరణలొస్తున్నాయి
మనం కలిసుంటే
మన భూములుపోతాయి
మనం విడిపోదాం
మన బిడ్డల్ని విడగొడదాం....
అంతే అంతేనండి
విడాకులు రాసెయ్యండి
ఎలా ఉన్నా మనం ఒక్కటేకదా...
విడిపోయామంటే
భూములు మిగుల్తాయి...
అన్నా !
ఇన్నాళ్ళు కలిసున్నాం
ఇప్పుడు కుదరటంలేదు
వేరు పడదాం
సుఖ పడదాం
అలాగే తమ్ముళ్ళూ....

వేరు పడటమే సుఖం
విడిపోయినా మనం ఒకటేకదా
ఈ పార్టీ పోకడ మాకు నచ్చలేదు
మేం విడిపోతున్నాం
వేరే పార్టీ పెట్టుకుంటాం
నచ్చని వాళ్ళు వెళ్ళిపోవచ్చు
ఎన్ని పార్టీలైనా పెట్టుకోవచ్చు

ఈ రాష్ట్రంలో
మేం కష్టపడుతున్నాం...
నష్టపోతున్నాం
మా రాష్ట్రం మాకివ్వండి
సోదరులుగా విడిపోదాం.

ఎక్కడున్నా
తెలుగువాళ్ళందరూ ఒక్కటే
ఆఁ...ఆఁ
వీల్లేదు...
తెలుగు వాళ్ళంతా కలిసుండాలి
విభజన వద్దు
ఏం
మొగుడు పెళ్ళాలకూ
తల్లిదండ్రులకూ పిల్లలకూ
అన్నదమ్ములకూ
పార్టీలకు
విడిపోతేలేని నష్టం
రాష్ట్రాలు విడిపోతే
ఏంటంట?







నేతల ప్రతాప్ కుమార్

# జననం ఒక జన్మహక్కు

నువ్వు కావాలన్నది నేను వద్దనడానికి
రంధ్రాన్వేషణ చేసినా
కారణాలేమీ కనబడటం లేదు –
నువ్వడిగింది నీదే అయినప్పుడు
ఇవ్వననటానికి ఇస్తాననటానికి
అసలు నేనెవడినో బోధపడటం లేదు –
మనిషికి మనిషికి మధ్య
వంద అంతరాలున్న దేశంలో
నీ బతుకు నువ్వు బతకటాన్ని మాత్రమే
విడిపోవడం అని ఎందుకంటున్నారో
వివరం కావడం లేదు –
తెలంగాణా ఉదయిస్తే
భరతమాత సౌష్టవం చెడిపోతుందనే వాళ్లు
తల్లి ప్రసవిస్తే బిడ్డ విడిపోయిందంటారేమో
తెలియడం లేదు –
ఒక శిశువు పుట్టాలనుకోవడం నేరమైనట్లైతే

ముందుపుట్టిన వాళ్ళంతా
నేరస్థులెందుకు కాదో విశదం కావడం లేదు
కొత్త రాష్ట్రాన్ని కలగనడం వేర్పాటువాదం అయితే
ఏ ఐక్యతా సూత్రం మీద
ఈ రాష్ట్రాలన్నీ ఏర్పడ్డాయో బుర్రకు తట్టడం లేదు
మా తెలుగు తల్లికి మల్లెపూదండ అంటే
తక్కిన వాళ్ళకి చెప్పుల దండ కానట్లు
తెలంగాణా తల్లి అంటే
తెలుగు తల్లిని అవమానించడం కానేకాదని
ఎందుకు అర్థం చేసుకోరో అర్థం కావడం లేదు
అయినా –
గుక్కెడు నీళ్ళ కోసం దోసిళ్ళొగ్గి ఎడారి చేస్తున్న అభ్యర్థనకు
గుండె కరిగి ఆకాశం వర్షించనట్లు
వృధాగా సముద్రంలో తగలడే మిగుల జలాలున్నను
బీడు భూముల గోడు విననట్లు –
సస్యశ్యామల దేశంలో పుట్టిన వాడెవడూ
నిత్యక్షామ పీడితుల కోసం ఆలోచించలేదు
పువ్వు పుష్పించడానికి కొమ్మను ప్రాధేయపడనట్లు
బిడ్డ జన్మించటానికి అమ్మనైనా సరే అడగనట్లు
తెలంగాణా ఉదయించటానికి
ఏ ఆంధ్రుడి అనుమతి అవసరం లేదు
స్వేచ్ఛగా పుట్టినవాడు
సంకెళ్ళతో బంధింపబడతాడేమోగాని
జన్మించడానికి సంకెళ్ళ అంగీకారం అక్కరలేదు
ఎందుకంటే జన్మించడం ఒక సహజహక్కు
అసలు జననమే ఒక జన్మహక్కు
జన్మహక్కునే కాదనే హక్కు
ఏ ఒక్కరికీ లేదుగాని...



ప్రయాణంలో పర్సుపోగొట్టుకున్న వాడు
అందరినీ అప్రమత్తం చేస్తున్నట్లు
ఒంటరిగా వెళుతున్న పిల్లలకు
తల్లి జాగ్రత్తలు చెబుతున్నట్లు
ఈ ఒక్కమాట మాత్రమే
నేను నీకు చెప్పాలనుకుంటున్నాను
తెల్లదొరల నుండి స్వాతంత్ర్యం తెచ్చి
నల్లదొరల చేతుల్లో పోసినట్లు
తెలంగాణాను మళ్లీ దొరల పాల్జేయకు
రామరాజ్యం పేరుతో మను రాజ్యం రానివ్వకు
భీమరాజ్యం ఆశ్రయంగా
బహుజన తెలంగాణాను సాధించు
సర్వజన రాజ్యం స్థాపించు





వడలి రాధాకృష్ణ

# విడి కలిసుందాం

కాలం కౌగిట్ల మావాడు
యాభై వత్సరాల చీకటి వెలుతురు సాక్షిగా
కలిసి అడుగు వేసినోళ్ళం
అనుబంధంతో మమేకమయి నోళ్ళం!!

వాడు నాదేహానికి రక్తం... ఊపిరి
చెప్పాలంటే ఓ మానసిక స్థితి
అందుకే స్థిత ప్రజ్ఞత సాక్షిగా వంచింప బడుతున్నాడు

వంచన వాడిది.... వంచేది నేను
సమస్యలు నేపధ్యమై సమతుల్యం లోపించి
అమానవీయతప్రజ్వరిల్లిన క్రమంలో
చెల్లని బాసలు నెరవేరని ఊసులు
ఓ పతన వ్యవస్థకు పరాకాష్ఠగా
నీరూ, నిధి దురాక్రమణ చేసినోణ్ణి

వనరుల వాడకంలోని దగా
కాల దొంతరల మధ్య గోడల్ని లేపుతూంటే



సెంటిమెంట్ సాక్షిగా రాళ్ళెత్తిన కూలీవాడు!
బంధించి బాధింపబడ్డ పిల్లితానుగా

వాడు ఇప్పుడో తిరగబడ్డ చైతన్యం
ఉవ్వెత్తు ఉద్యమం!!
నా అంతరాత్మ ప్రబోధిస్తూనే ఉంది
వాడి నాడి వినిపిస్తూనే ఉంది
దానిలో ఉదాత్తమైన విశ్వాసముంది
ఆత్మీయత, అభిని వేశముంది
భావోద్వేగం, ఆత్మ ప్రేరణ ఉంది.
భావోద్రికత్త, విషయ సారూప్యత ఉంది.

నాకిప్పుడనిపిస్తూ ఉంది
వాడి త్యాగం ముందు నా స్పందన ఎంత అని
ఉమ్మడి కుటుంబ విచ్ఛిత్తి సార్వజనీకమయిన కాలంలో
అక్కడైనా ఇక్కడైనా
విడి వడడంలోని వన్నె
వాడినీ నన్నూ దగ్గరగా చేస్తూనే ఉంటుంది!

అందుకే నాలోని వాడు
దూరంగా జరుగుతూంటే
మాలోని సెంటిమెంటు
"విడికలిసుందాం!!" అంటూ ఎలుగెత్తి అరుస్తోంది!!





డా॥ గూటం స్వామి

# ఎవరి తరం?

వాళ్ళకీ మాట్లాడే హక్కుంది...!
వాళ్ళకీ పోరాడే తత్త్వముంది
ఆంధ్రదేశమంటే తెలంగాణమే కదా !
దక్షిణాపథంలో విశాలభాగమే కదా!
ఇక్కడ భూమి శిలామయం...
అపార ఖనిజ సంపదకు ఆలవాలం...!

వరంగల్ తివాచీలు
కరీంనగర్ వెండిబంగారు తీగపని
అలంపురం జంపఖానా
పెంబర్తి ఇత్తడి పాత్రలు
సిద్ధిపేట పట్టుసెల్లాలు
తెలంగాణా కీర్తి కిరీటాలు...!!

ఫ్యూడల్ భూస్వాముల ప్రవేశంతో
తెలంగాణా తెల్లబోయింది
భూమి విముక్తమైతే



భవిత స్వర్గమయమే...!
దొరల పెత్తనం అంతమైతే
సర్వం ఆనందమయమే...!!
తరతరాల బానిసత్వం పోవాలంటే
తెలంగాణ విముక్తి జరగాల్సిందే...!
విభజన అనివార్యమైనప్పుడు
అడ్డుకోవడం ఎవరితరం?

తెలంగాణ
కోటి రతనాల వీణే కాదు
కోటి రకతాలు చిందిన నేల...!
భూమి కోసం, భుక్తి కోసం పోరాడిన నేల...!
సామాజిక న్యాయమంటూ జరిగితే
ముందు తెలంగాణాలోనే జరగాలి!
తెలంగాణా ప్రజల గుండె చప్పుడు వినాలి





తూలుగు రమణారావు

## వాళ్లనీ బ్రతుక నిద్దాం

ఊరుకుంటున్నారని నేడు
కవి పోతన్న నే
కిడ్నాప్ చేసేస్తుంటే
రేపు....
ఆంధ్రా వాడో
రాయలసీమోడో
మనలో ఎవడో ఒకడు
ఇదీ మా ప్రాంతమే అంటూ
జెండా పాతదని
ఏమిటి నమ్మకం?
ఎవరికి అందాల్సిన ఫలాలు
వారికి అందనినాడు
తిరుగబడతారు
తప్పదు మరి
అది వారి హక్కు
ఎవరి ఉనికిని వారు



కాపాడుకోవటం
తప్పు కాదు
ఒకే తల్లికి పుట్టినా
ఎంత అన్నదమ్ములైనా
ఎన్నాళ్లు కలిసుంటారు
ఏనాటికైనా విడిపోవాల్సిందే కదా
నాటి ఉమ్మడి మద్రాస్ నుంచి
'ఆంధ్రప్రదేశ్' పేరు కుంపటి
పెట్టడానికి కారణం...?
మరి
నేడు వారి తెలంగాణాను వారు
అడుగుటలో న్యాయం లేదా?
నా ఆకలి నీకు తెలుసా?
నీ ఆకలి నాకు తెలుసా?
ఎవరి ఆకలి బాధ వారి కెరుక

నేడు తెలంగాణాకు జరుగుతున్న అన్యాయం

రేపు మనకీ జరగదని ఏమిటి నమ్మకం
తప్పదు మరి...
జాగు చేయక
స్వేచ్ఛా తెలంగాణకే జే కొడదాం
వాళ్లనీ బ్రతుక నిద్దాం





డాక్టర్ ధేనువకొండ శ్రీరామమూర్తి

# కూడికలు - తీసివేతలు

మౌనంగా వుందామనుకున్నపుడే మాట్లాడాల్సి వస్తోంది
నదిని చూసినేర్చుకో నాయనా!
ఇక్కడ రెండు నదులు కలుస్తున్నాయి
అక్కడ నది పాయలు పాయలుగా చీలి ప్రవహిస్తుంది
నీటికి నిజం చాల తెలుసు

నదిని చూసి నిజం నేర్చుకోనాయనా!
తెంచుకున్నా తెగని బంధం
స్వార్థపు చక్రంలో ఇరుక్కుపోయావు
ఇరుకు ప్రమిదలో వెలుగుతున్న వెలుగు
చిల్లుల కుండలోంచి విచ్చుకవస్తోంది
అర్థం కానిది మనిషి మరగుజ్జు తనం
ఈతరాని సమీపగతం తెలీదు
నాజీలు
నిజాలు
కాన్సన్ట్రేషన్ కాంపులు



కాశింరజ్వీ అరాచకాలు
ప్రత్యక్ష పరోక్ష హింసల మయం
ఏదో కథ చెబుతుంటారు
అందరూ 'ఊ' కొడుతుంటారు
నిన్ను నీవు మరుగుపరుచుకోవద్దు
మనిషికి తెలిసింది
ఒక్కటే!
వినమ్ర విస్ఫోటనం
వాడిది మర్మ సంభాషణ
రహస్యమేదో తనకే తెలిసినట్లు వాక్రులనం
మనం
తగిన సమయంలోనే మాట్లాడుకుంటున్నాం
ఒక్క నిముషం ఆగి ఆలోచించు
గర్జించు రష్యా, గాఢించు రష్యా
ఏది ఈ రోజు
జర్మనీ గుండెను చీల్చి కట్టిన
బెర్లిన్‌గోడ
బద్దలయిందికదా!!
అది అనివార్యం
ఇది ఆహ్వానీయం
కలసివుంటే సుఖం లేనప్పుడు
కడగా వుంటే కానిదేముంది??





శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి

# తెలంగా(యం)ణా

రాజకీయాల కుమ్మరపు ఆవంల
గద్దెల గటాల యెంకులాటతోని
వేరుకుంపటి సారెదిప్పుడు సంగాలకి
నే సోటుబెట్ట
ప్రజల నుంచి అత్తేనే గోస పోరుబాట ఐ తది
పొత్తుల ముసుగులల్ల
ఓటు ఒనరు వల పన్నుడు పార్టీలకు మనసియ్య
తొమ్మిది- పది
కల్లోలిత జిల్లాల యెల్లలలోగిలి
ఏభై యేళ్ళ సందీ ఒకే తీర్గ
ఆరని కుంపటిలెక్క- రగిలే
ఉమ్మ యెతల దూపపాట జూసి
దమ్ము గొంటాండబిడ్డ
పేదల ఆకలీ దొరల దోపిడీ అడకతెర్ల
సిక్కి జిజ్జైతాన్నదదీ
తెలంగాణా గాదే అయ్యా గది తెలంగాయం



ఇప్పుడేంది వయ్యా తెలంగాణా విద్రోహదినం పాటించుడు
గా కాఖీల గత్తర్ల
అగో పాలమూరు మురిపాల బిడ్డ
అలోమని అమరత్వం పొందింది పొంటే
పవుర హక్కుల రెక్కలూగిట్ల తెగిపోబట్టె
అవు... ఇంగనన్న పల్లెల్ల బత్కుల్ల
బతుకమ్మ పండుగగా మంచిగ మారా లెకాలం
ముంగట్కిగావాలె నిమ్మళం
మీ రాజ్యం మీకు దక్కనింకె
ఆరివారంతోని కూకున్ననంటె
సకళం ముకుళం సకలం ముకుళం





కొండెపోగు బి. దేవిడ్ లివింగ్‌స్టన్

# ఎప్పటి స్వప్నం యిది

ఎన్ని తరాల ఆకాంక్ష యిది
ఎప్పటి స్వప్నం యిది
రెప్పల కిందదాచుకున్న
నిరీక్షణా తప్త మధుర భాష్పం యిది
పచ్చటి శాద్వలాలు హసించే
పాటి పంటలతో పల్లెలు భాసించే
పొటెత్తిన పాటల తెలంగాణా కోసం
కళ్ళలో రక్తపు దీపాల్తో
ఇంకెన్నాళ్ళీ ఎదురు చూపులు
నైజామ్ నిరంకుశత్వాలకు
ఎదురొడ్డి పోరాడి
రజాకార్ల పీడన సంకెళ్ళు త్రెంచుకుని
స్వేచ్ఛా గీతం పాడే గొంతుకు
ఉమ్మడి రాష్ట్రపు ఉచ్చు బిగుసుకోగా
ఎదురు చూసిన వసంతం
ఎటో వెళ్ళిపోయింది అనంత దూరాలకు



కొత్త ప్రత్యూష్యం కోసం
పల్లవించే నూత్న రాగాల కోసం
కలలుగన్న కోటి రతనాల వీణ తెలంగాణ
మళ్ళీ మూగబోయింది
అప్పటి నుండి అన్నీ
నేల విడిచిన సాములు
వాగ్దానాలు – వాగ్బాణాలే తప్ప
ఈ నేలపై నేస్తం! నీ హక్కు భుక్తాల్ని
నిర్ణయించేందుకు ఎన్ని తతంగాలు, తాత్సారాలు
ఒక్క అడుగూ ముందుకు పడదే
లే యిక! కదులు కాగడావై!
పొంగి పొరలే మహోదధివై
పలికించు నవ కవనాలను
కవోష్ణ విప్లవ పవనాలను
అదిగదిగో వెన్నెల తెలంగాణా
బంగరు వన్నెల తెలంగాణా
ఎన్నాళ్ళ స్వప్నం ఇది
ఎప్పటి నిరీక్షణా తప్త మధుర భాష్పం ఇది
వెయ్యి యోజనాల పయనమైనా
ఒక్క అడుగులో మొదలౌతుంది
పద మరి నీతో నేనుంటా!





రావినూతల ప్రేమ కిషోర్

# ఉద్యమానికి ఊపిరిగా...

వాడంతే –
నన్ను వంచించినట్టే నిన్నూ వంచిస్తున్నాడు
'నా ముద్ద నాకు కావాల'ని అన్నందుకు నన్ను
'నా నేల నాకు కావాల్సిందే...” అన్నందుకు నిన్ను
దోషిలా చూస్తున్నాడు... ద్రోహం చేస్తున్నాడు
వంచన వాడికి కొత్తకాదు

వాడంతే –
'ఐక్యత' పేరుతో నన్ను
'సమైక్యత' పేరుతో నిన్ను
మోసం చేస్తూనే వున్నాడు
మోసం వాడికి కొత్తేమీకాదు... కొత్తదేమీ కాదు

మన కలల్ని గురిపెడతాడు
మన కోరికల మీద నిఘాపెడతాడు
పోటెత్తిన రోడ్లమీద అలలై ఎగుస్తున్నవేళ
సమైక్య వలల్ని సిద్ధం చేసి



ఇన్‌స్టెంట్‌గా మన ఆశల్ని బంధించాలని చూస్తాడు
అరెరెరే...
వాడెంత మాయలోడు
వాడింత మోసం చేస్తాడనుకోలేదు
బ్యాలెట్ బాక్సుల ముందు
లెక్కలు తేలని లేకితనం...

అర్ధరాత్రి ప్రకటన –
అల్లకల్లోలం చేసింది
కల్లోల కలతల్ని కళ్ళనుంచి తుడిచేలోగా
నా వేళ్ళమీద ఫెడేల్మన్న సమైక్యవాదం
విద్రోహం రాత్రికి రాత్రే
ఎంత ఆత్రంగా జడలు విప్పింది ?
నెత్తుటి చెక్కిలిమీద
ఆనందంతో జారుతున్న కంటిచుక్క
అర్థంకాక మధ్యలోనే ఆగిపోయింది
ప్రశ్నార్థకంగా మిగిలిన కళ్ళల్లో
కూలుతున్న ఆశలు...
మళ్ళీ మోసపోతున్న తెలంగాణా...

తెర బయటే నిస్సిగ్గు నాటకాలు..
రంకునేర్చిన రాజకీయం
దొంగనినాదాల్తో వీధుల్లో కొచ్చింది
కన్నీళ్ళను హైజాక్ చేస్తూ
పేరడీ ఉద్యమాల గారడీ చేస్తోంది
'సమైక్యం' నీతిబోధల బుసలు కొడ్తూ
ఢిల్లీలో డేరాలేసి డొక్కలు బాదుకుంటోంది

అక్కడేంటి ?
కుటిల దీక్షల శిబిరంలో

నంగనాచి 'ల్యాంకో' అబద్ధాల ర్యాంప్‌వాక్ చేస్తోంది
పిల్లిబిత్తిరి శెకలు పోతోంది
ఎవడెన్ని పిచ్చిచేష్టలు చేస్తున్నదీ
కాలం కనిపెడుతూనే వుంది
చరిత్రముందు ఒకనాటికి
వాడు పతనమవ్వక తప్పదు
ఈ నెత్తుటినేలలో
వాడు శిథిలమవ్వకా తప్పదు ... వాడంతే

అన్నా !
కడుపు కాల్లినవాడే
కాకై మండుతాడు... కేకేసి నిలుస్తాడు
నీదీ నాదీ బతుకు పోరైనప్పుడు
మనిద్దరి కన్నీళ్ళూ ఒకటేకదా..!
మన కళ్ళల్లో రాజుకున్న నిప్పు సెగల్ని
పోరాటబావుటాల్ని జేసి హోరుమని నినదిద్దాం...
నీ జెండాకు నే అండగావుంటా...
నీ ఉద్యమానికి నా ఊపిరినిస్తా...
నీ ధూంధాంలో దండోరా గుండెనౌతా...
నువ్వునేను కలిస్తే వాడెంత ? వాడి రాజ్యమెంత ?
ఇక సోనియా ముందు దాండియా ఆడదాం
ఎర్రకోటమీద బతుకమ్మ పండగజేద్దాం







అరసవిల్లి కృష్ణ

# ముసుగు

రెండు చూపులు
ఒకే కారణం నుండి విడిపోయినా
వెలుగు ధ్వంసం కాదు
పొలం గట్టుపై కూర్చున్నా
పొలంలోకి, దిగినా,
ఇంటి గడపదాటి లోపలికెళ్ళినా
గడప ఇవతల కూర్చున్నా
మనిషి ఓ ప్రవాహమే!
సూర్యుడి ముఖాన్ని
చీకటితో కప్పినా
నా శరీరంలోను
నా హృదయంలోను
ఓ దీపం వెలుగుతూనే ఉంటుంది

విరిగిపోవడం
అతికించు కోవడం
తెలియని విద్యకాదు
ప్రాణహిత నిశ్శబ్దంగానే వుంది

నన్ను చూచి
నవ్వుతూ ఉంటుంది
ఎండిన ప్రాణహిత
ఇసుక మేటలలో
నా ఆకాశం కూడా ఉంది
ఓ రాత్రి జీవనదిపై నిద్రించాక
ఓ నక్షత్రం నాతో మాట్లాడింది
నీ ఆకాశం నీకుంది
నీకల నీకుంది
నీ అన్నమ్ముద్దపై
ఆకుపచ్చని కల ఉందని
రాత్రి విడిచేసిన దుస్తులలానే
నా నుండి
అన్ని ముసుగులు తొలగినాయి
దొంగిలించిన చంద్రున్ని
దాచేందుకు
నాలో చోటులేదు
ఎవరి రాజ్యాన్ని
వారు ఏలడంలోనే
జీవన సౌందర్యముంది
రెండు చేతుల్ని
ఒకే ఆకాశంపైకి లాక్కుంటాను

దీపం వెలుగుతూనే వుంది
జీవనదులు మాట్లాడుతూనే ఉన్నాయి
విడి పోయేందుకు
కలిసేందుకు
ఓ నావ సిద్ధంగా ఉంది
ఆ నావలో
ఆనందంగా కూర్చున్నాను
ఆశలు లేనివాన్ని







వాగుమూడి లక్ష్మీ రాఘవరావు

# మా తెలంగాణా తల్లి

తెలుగు నాట తెలంగాణ
కోటిరతనాల వీణ
శతకోటి మధురభావాల
నవరస గోదారిలీల తెలంగాణ
పోతన కలాన ఉప్పొంగె భక్తి సంద్రాలు;
పోతన హలాన పరవసించి పరవసించి;
పచ్చని పైరుల మాటు యశసించే;
మన తెలంగాణ తల్లి
ఆ తల్లి పలుకులే తేనె సంద్రాలు
ఆ తల్లి కట్టుబొట్టు మాటుంది
పల్లె తల్లి మురిపాల నిండుదనం;
రెండు చేతులెత్తి దండం పెడుతున్నా
తెలంగాణ తల్లి మా తెలంగాణ తల్లి
జిలుగు వెలుగుల తెలుగు జాబిల్లి
వందనాలమ్మ వందనాలు

తెలంగాణ తల్లి మా తెలంగాణ తల్లి
విదేశాలలో సహితమున్నారు తెలుగువారు
తెలుగు దీప్తిని గ్రహాలకెగ ప్రాకించారు
కలసి కొట్లాడుకునే కంటే
విడిగవుండి విందులు చేసుకోవడం మిన్న
ఎక్కడున్నా ఎలా ఉన్నా మనమంతా
తెలుగు వారమన్నా.







సజ్జా వెంకటేశ్వర్లు

## రావమ్మా తెలంగాణా!

రావమ్మా
తెలంగాణా
రావమ్మా!
కోట్ల గొంతులు నిన్ను
కోరి రా రమ్మంటున్నాయ్
కోటి రతనాల వీణా
రావమ్మా
తెలంగాణా
రావమ్మా
ప్రజాకవి
కాళోజీ
పంచిపెట్టిన
స్ఫూర్తిలోన

రావమ్మా
తెలంగాణా
రావమ్మా

మా చెర
ఏతం బెట్టిన
మంది పాటల
ఉరవడిలో
రావమ్మా
తెలంగాణా
రావమ్మా
సమస్త జనులు
సక్కంగ బతుకు
సమస్త పీడ్నలు
సాగనంపుతూ
రావమ్మా
తెలంగాణా
రావమ్మా
బతుకమ్మను
స్మరించుకుంటూ
సమక్క సారక్కలకు
పసుపు కుంకాలిస్తూ
రావమ్మా
తెలంగాణా
రావమ్మా
నువ్వొచ్చే దారిన
సాయుధ దప్పులు
శాంతి యాత్రలై మ్రోగంగ
ఆటా పాటా నీ కొరకై సాగంగ
రావమ్మా
తెలంగాణా
రావమ్మా

యూనవర్సిటీ వీపులపై
మట్టి మనుషుల శ్వాస
మహత్తర తెలంగాణా అంటూ
మంచి పల్లవి ఆలపిస్తూ
రావమ్మా
తెలంగాణా
రావమ్మా
నువ్వొస్తేనే మా కవి దోస్తుల యింట
ముక్క బువ్వతినాలని
ఒట్టు పెట్టుకున్నానమ్మా
రావమ్మా
తెలంగాణా
రావమ్మా
చేదు తీపుల
తొలి ఉగాదిగా
పడుగు పేకల
కల నేతవై

రావమ్మా
తెలంగాణా
రావమ్మా





డా॥ ఇ. శంకరరావు

# జనగర్జనల రంగస్థలం

ఉద్యమ నెలబాలుడు ఊరిమీదకొచ్చాడు
నా జనం నావాటా నా నేల అంటూ లెక్కలడుగుతున్నాడు
నా నేల నా తల్లి తెలంగాణా దగా పడిందంటూ
జనగర్జనల రంగ స్థలం అప్రమత్తమయింది
ముల్తానా రాగం కరుణరసాన్ని పండిస్తుంది
ఆశ్చర్యం అందలమెక్క రాత్రికిరాత్రి
అద్దంముందు సోకు చేసుకుంటుంది
కుల, మత, ప్రాంతాల జెండాలు ఎగురుతున్నాయి

సమైక్యం, అభివృద్ధిల శ్రీరాగం
సంక్రాంతి కానుకలా గొంతెత్తి పాడుతుంది
ఆ రాగం శ్రీరంగనీతులు వల్లిస్తూ
గురివింద గింజౌతుంటే దారితెలియని నాకు
ప్రపంచాన్ని ధిక్కరించిన ఆచూపుడు వేలు
చురుక్కున తుకి దారి చూపించింది
తరాల చరితలో దారుణమరణాలు పీడకలలు



వెంబడించగా వలస పక్షులైన వైనం మాకింకా గురుతే
నాడులేని ఐక్యతల సమైక్యతల అర్థాలు
నాటి ఇంద్రవెల్లికీ, మా కారంచేడుకీ తెలుసు
ఆ నిజాల నీడలు మీకు గురుతు రావడంలేదా?
మీకు మాటలకి పదాలు దొరకడం లేదా?
నేడు కాళ్ళ క్రింది నేల కదులుతుంటే
ఐక్యతా రాగాలు పుట్టుకొస్తున్నాయి
ప్రాంతం కన్నా నాకు నా దళితజాతి ప్రధానం
మా జాతి బతుకు నాకు ముఖ్యం
వీధి నాటకాలాడి విజ్ఞానం పంచిన
మా ముందు మీ చిల్లర నాటకాలు చెల్లవు
దగాపడిన మా బతుకు లెక్కలు తేల్చాల్సిందే





కళ్యాణ్ కత్తి

# తెలంగాణా తెగువకు తలవంచాల్సిందే

ఏవూరివాడు!
మావూరొచ్చి
మామీద పెత్తనం
సాగాలంటాడు!?

ఎవడి అజమాయిషీలేని
సొంత బతుకోసంకదా
ఒకేవొక్క నినాదమై
ఇన్నేళ్ళూ వుద్యమించింది

స్వేచ్ఛగా, సమానంగా
బతకాలని కదా
సభ్యసమాజం కోరుకునేది

లేనిపోని డొంక తిరుగుడు
ముచ్చట్లతో చర్చలెందుకు!

విశాలాంధ్రపదం
వినటానికి బాగానేవుందికాని,



ఈ అనంత భూభాగం
ఎవడి చేతుల్లోవుంది?
ఎవడి పెత్తనం కొనసాగుతుంది?!
ఇదే కదా అసలు సమస్య!

ఒక ప్రాంతానికి సరిహద్దులు
నిర్ణయించినంత మాత్రాన
మనుషులు విడిపోవడం
ఎలా అవుతుంది?!

ఆ మాటకొస్తే,
ఈ భూగోళానికి సైతం
అక్షాంశ రేఖాంశ
గీతలుంటేనే కదా, ఏ ప్రాంతం
ఎక్కడుందో లెక్కతేలేది

ఒక మహానదిసైతం
పాయలు పాయలుగా విడిపోయి
భూభాగమంతా సమాంతరంగా
ప్రవహిస్తేకదా
అందరికీ గొంతు తడిచేది!
ఇప్పుడు తెలంగాణా
చిత్రపటం చూస్తుంటే,
గుండెకి తగిలిన బుల్లెట్ దెబ్బకి
చిందిన నెత్తురు మరకలావుంది

ఇప్పుడు తెలంగాణా
కోటిగాయాల వీరోచిత
పోరాట వీరునిలావుంది

కెరమెరికొండల్లో
నిజాం సర్కారు క్రౌర్యాన్ని
ధిక్కరించి పోరాడి
అమరుడైన కొమరంభీం సాక్షిగా

పరాయి పెత్తనాన్ని సవాల్జేసిన
పదునైన కత్తిలాంటి సమ్మక్క సారక్కల
వారసత్వం కదా తెలంగాణ

ఇప్పుడు మాత్రం
పరాయి పెత్తనాన్ని
ఎందుకు సహించాలి తెలంగాణ!
తెలంగాణా తెగువకు
తలవంచాల్సిందే!

కానీ ఒకే ఒక్క ప్రశ్న
రేపైనా... తెలంగాణా
దళితుల కళ్ళల్లో
కాస్తంత వెలుగును
చూడగలమా!







ఎ. నాగరాజు

## తెలంగాణా !

ఇక్కడ తెరుచుకున్న తలుపు ఇంకోచోటుకు తెరుచుకోదు
ఇప్పుడు విచ్చుకున్న కన్ను మరోసారికి వెలుగు నివ్వదు
ప్రతీదీ ఎక్కడికక్కడే

మాటాడేవాడు మాటాడుతూనే ఉంటాడు
తను విసిరిన గాలానికి తానే చేపగా చిక్కుకుని
తను నాటిన కొక్కేనికి తానే దిక్కూచిగా వేలాడి –
మాటలంత అసందర్భత అనేకమార్లు మరొకటుండదు

నిజంగానే ఈ రోజులెంతటి
మహత్తరమైనవీ, దౌర్భాగ్య భరితమైనవీ?

పేరేదైనా అంతటా ఒకేలాంటి అశాంతి
కాసేపు దారులన్నీ నిర్మానుష్యమై, మరి కాసేపటిలో
పోటెత్తే జనప్రవాహమై

సందర్భాసందర్భాల నడుమ
జీవితాలకొలదీ గడించిన జ్ఞానం, అనుభవం

ముసురు కమ్మిన ఆకాశంలా
ఒకలాంటి దిగులు, నిరుత్తరత

ఈ రోజున మళ్లీ మొదటినుండీ నేర్చుకోవాల్సిన అవసరం పడింది

పోగయే జనసమూహాలన్నీ జనం కోసమే కాకపోవచ్చు
ఎగసే గొంతుక ప్రజలదే అయినా
అది ఒక రహస్య గండ కత్తెరగా వారి గొంతుకలనే
గురిచూడవచ్చు
నిజంగానే ఈ రోజులెంతటి
దౌర్భాగ్యకరమైనవీ, మహత్తరమైనవీ?
అమ్మా తెలంగాణా !
జనం ఘోషల నడుమ నువ్విప్పుడు
శిలువపైకెక్కించబడిన అపర క్రీస్తువు
అజ్ఞానం ఒక్కటే కాదు
ఇంకా తెలియని వేవేవో నడిపిస్తే
నడిచే యూధాలం

మమ్మల్ని క్షమించు తల్లీ







యం.డి. మహబూబాలీ

# తల్లి తెలంగాణ

ఇప్పుపూ వన్నెతో
అడివి మల్లె నవ్వుతో
పనిపాట నమ్ముకున్న గడ్డ
చెమట సుగంధాల తెలంగాణ!

బిడ్డల్ని పోరాటాల బలిచ్చి
చిన్నాటి కన్నపేగు ఊసుల్ని
కన్నీటి పాటగా మీటే
కోటి తంత్రుల వీణ తెలంగాణ!

పల్లె పంట పొలాలపై
సెజ్ కాంక్రీటుప్పెనొచ్చినా
ధిక్కార స్వరంతో మొలకెత్తె సత్త
తెలంగాణ మాగాణిది!

ఉద్యమాల్ని ప్రసవిస్తు
రాష్ట్ర సాధనకోసం తపిస్తున్న
పచ్చి బాలింతరాలు
తల్లి తెలంగాణ!





బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

# తెలంగాణ చెల్లి

గతంలో మన తాలూకాను
మండలాలుగా విభజించినట్లే
ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌ను
రెండు రాష్ట్రాలుగా రూపొందించాలి.
సమిష్టి కుటుంబం పెరిగితే
విడిపోవటం సహజం కదా!
ఇరుగు పొరుగులా వుంటూనే
సఖ్యత ఐక్యత ముఖ్యం కదా!
చిన్న రాష్ట్రాల వల్ల పరిపాలన సులభం
రాష్ట్ర విభజనతో ప్రగతి సాధన సంభవం
కాల గమనంలో తెలంగాణ
చారిత్రక అవసరం
దాన్ని సమస్యగా విమర్శిస్తూ
రచ్చ చేయటం అనవసరం
సామరస్యంగా తెలంగాణా
కావాలి ప్రత్యేక రాష్ట్రం



రాజకీయంగా ఉద్యమాన్ని
చేయద్దు రావణ కాష్ఠం
తెలంగాణా ప్రజలది
వేర్పాటు ఉద్యమం కాదు
స్వయం ప్రతిపత్తి వాదం కాదు
ప్రత్యేక హక్కుల తత్వం కాదు
రాష్ట్ర విభజన పోరాటం మాత్రమే!
తెలంగాణా రాష్ట్ర కోసం
మరో పొట్టి శ్రీరాములు బలి కాకూడదు
ప్రజల కలల సౌధాలు కూలి పోకూడదు
అందుకే అంటున్నా!
అన్నయ్యలుగా ఆంధ్రులమంతా
"తెలంగాణా చెల్లి"కి బాధ్యతతో
అప్పగింతలు చేసేద్దాం
మాసిపోని మమతలతో
ఒప్పందాలు చేసుకుందాం





డా॥ బద్ధిపూడి జయరావు

# తెలంగాణా విముక్తి గీతం

ఇది ఉద్యమాల పురిటిగడ్డ
ప్రజాపోరులో పునీతమైన పుడమి తల్లి
కష్ట జీవుల కలిమికి కలలుకనే
సామ్యవాదానికి గుండెకాయ
తరతరాల ఎట్టి బతుకును
యుగాల బానిసత్వాన్ని ఖండిస్తూ
తెగించి పోరాడుతున్న రణభూమి
నైజాం సర్కారును గడగడలాడించడానికి
వేలపిడికెళ్ళు కలాలై కదిలిన కవులగడ్డ
జనపదుల జాగృతికోసం
కలలు కళలై గొంగళి ఒగ్గుకథలై
విప్లవగీతాలై వీరవిహారం చేస్తుంటాయి
భూమికోసం భుక్తికోసం
ముక్తికోసం ముద్దకోసం
శతాబ్దాల పోరిన నెత్తుటి గడ్డ
బక్కచిక్కిన బంజరులో
ఏరువాకలకు ఎదురుచూస్తున్న
రైతుల ఆర్తనాదాలను జీర్ణించుకున్న నేల
కండలు కరిగించే సింగరేణి
కొండలు పిండే కార్మిక స్వేదం
పొగలు సెగలు గక్కుతూ
పౌరుషం ప్రజ్వలిస్తుంది.
కాని... ఇప్పుడు
కోట్లగుండెల స్పందన గీతమే
వీర తెలంగాణా!
ఆత్మపరిశీలన ఆయుధమై
విభజన సమరం జరుగుతుంది
భూమిబాటే అంతిమలక్ష్యంగా
తిరుగుబాటు ముంచుకొస్తుంది
విముక్తి గీతం విజృంభిస్తేనే
వీరతెలంగాణా వర్ధిల్లుతుంది
అమరుల ఆశయం సిద్ధిస్తుంది





మంచికంటి

# ప్రజా తెలంగాణ

తెలంగాణ మట్టినీ మనుషుల్నీ చూసినప్పుడల్లా
నీటి ఒడ్డున తచ్చాడుతున్న సోమాలియాలు గుర్తొస్తాయి
తెలంగాణ భూమి పుత్రుల్ని కదిలించినప్పుడల్లా
కల్లోలమౌతున్న లాటిన్ అమెరికా దేశాలు జ్ఞప్తికి వొస్తాయి
తెలంగాణ చరిత్ర కళ్ళ ముందు కదులుతున్నప్పుడు
పోరాట రూపాలెన్నో పాఠం చెప్పినట్టుగా ఉంటుంది
పాలమూరు కూలీలను చూసినప్పుడైతే
సైబీరియా వలస పక్షులే గుర్తుకు వొస్తాయి
మనిషి మనిషినీ పట్టిపట్టి చూసినప్పుడు
ఎన్నెన్నో కళారూపాలు గజ్జెకట్టి కళ్ళముందు ఆడినట్టే ఉంటుంది
కట్ట మైసమ్మలూ సమ్మక్క సారక్కలను చూస్తుంటే
గ్రామదేవతలే ఇప్పటికీ చేయెత్తి ఆశీర్వదిస్తున్నట్టు ఉంటుంది
నా తెలంగాణా మిత్రులు యాసలో మాట్లాడుతున్నప్పుడు
తాత ముత్తాతల నాటి పరిమళమేదో
నన్ను చుట్టి ముట్టినట్టే ఉంటుంది



ఆ మట్టిలో అడుగు పెట్టినప్పుడల్లా
అడుగడుగునా రక్తం చిందించిన అడవి గుర్తుకొచ్చి
త్యాగాల భూమికి తల ఆనించి నమస్కరించాలనుంటుంది
తెలంగాణ సోదరులెవరు గళమెత్తినా
సంస్కృతీ సాంప్రదాయాలన్నీ జరజరా పాకుతూవొచ్చి
ఆత్మీయంగా అల్లుకున్నట్టే ఉంటుంది
చిత్రకారుల కుంచెల గుండా ప్రాణం పోసుకున్న చిత్రాలు
కళ్ళ ముందు కదిలినప్పుడల్లా
అమ్మో, అయ్యో! కలలో నుండి నడిసొచ్చి
ఆప్యాయంగా తల నిమురుతున్నట్టే ఉంటుంది
తరతరాల పోరాట చరిత్రలో తల మునకలైనప్పుడల్లా
రాతిగుండును భుజాలకెత్తుకున్న హెర్క్యులస్ కళ్ళముందుకొస్తాడు
అమ్మలారా! అక్కలారా! అన్నలారా! తమ్ములారా!
మీ పోరాట స్ఫూర్తికి వేనవేల దండాలు





డా॥ జి.వి. రత్నాకర్

# బహుజన తెలంగాణ

నీనా ఆశయం ఆకసమైనాక
నువ్వూ నేను వాటాకోసం పోరాటమైనాక
నేలా నింగీ పోరాట బావుటాలైనాక
ఎన్నాళ్ళీ ఏకీకరణ యత్నాలు
సమైక్యాంధ్ర శుష్క నినాదనాదాలు
ఒట్టిపోయిన చాపకూటి సిద్ధాంతాలు

మా మాలపల్లె ముంగిటి
ఏలెత్తి చూపుతున్న పెద్దాయన అంబేడ్కర్ సాక్షిగా
సెన్న కేసులు పోమె సాచ్చికంగా
అంకమ్మగుడి కాడి పోలేరమ్మ గుర్తుగా
ఆ పక్కనున్న సాయిబుల జెండా చెట్టుకాడ
మూడు రంగుల జెండాని ఎలేసిన
నీలిరంగు జెండా మూడురంగుల్ని
నిలేసి నిలువునా అడుగుతుంది
ఊరికి, పాలేనికి, పల్లెకున్న



తరాలతేడాల్ని ప్రశ్నిస్తుంది
తెలంగాణా నినాదాన్ని ఆ నిజాయితీని
కూటిని కూటిపల్లేన్ని ఆమెతుకుల్ని
బందగీ లుగా నాటి నిజాంని
మొన్నటి రజాకార్లని నిన్నటి వీర తెలంగాణా పోరాటాన్ని
నాటి రాజకీయాల్ని
మాల – మాదిగ ఆదివాసీ గూడేలు అడుగుతున్నాయి

ఎగిరిన జెండాలో నారంగు ఎందుకు ఎలిసిందని
కురిసిన వానలో నా కన్నీటి చుక్కలెక్కడని
పారిన నెత్తుటిలో నా ఏలిముద్ర లెక్కడని
ఆ తండాలో, ఆ గూడెంలో, ఆ పల్లెలో పాలెంలో
నేలకోసం నీటికోసం, ఎలుతురు కోసం
ఎన్నాలీ అగచాట్లు అంటున్నాయి
ఇంకెన్నాల్లీ అగ్రకుల పెత్తనాలు అని నినదిస్తున్నాయి

బహుజన వాదంతో మనం
ఎగిసిపడే అలలైననాడు
నిద్ర నటిస్తున్న సంద్రం
ఆ మాటునున్న రాజకిరీటాలు
నెత్తురు కక్కుకుంటూ
మా పల్లె ముంగిట మోకరిల్లక తప్పదు





దుగ్గినపల్లి ఎజ్రాశాస్త్రి

## "మనుషుల్లా మాట్లాడుకుందాం - రండి!"

పిట్టకథలు
ఆవు పులి
మార్జాల కథలు వద్దు

నొసటి మీద రాతలు
అరచేతిలో గీతలు
నీటిమీద భాషలు కాదు
శాసనం కావాలి చట్టం కావాలి

ఇనపగోడలపై పిల్లివాటం
తడెకచాటు మాటలొద్దు
మనసు అంతరంగంలో
ఆలోచనా ఆయుధాలు
జమ్మిచెట్టుమీద పెట్టండి

షాడోనీడలు, అంతరంగ
రక్షక కవచాలు ఆయుధాలై నడుస్తుంటే
చర్చలు కల్లలౌతాయి



తెలంగాణ కోసం ఉరితాళ్ళు, బలిదానాలు
ఆత్మ హత్యలు కాదు
ఉద్యమం ఉక్కుగంటై మోగాలి
ఇప్పుడు మరణశయ్యపై శాంతి
ముందు భీష్మణ్ణి లేపండి

కపోతాలకు కత్తులు వద్దు
యుద్ధం ముగుస్తుంది
కత్తులు సజీవం

మర మనుషులు
ఇనుపకవచాలు
ముళ్ళకంచెలు
రాతి హృదయాలువద్దు

మనస్సుతో మాట్లాడుకుందాం!
మనుషుల్లా మాట్లాడుకుందాం రండి!!
ఆకాశం
గాలి
నేల
నీరు అందరివి...
తెంచుకుందాంరండి!!
పంచుకుందాంరండి!!!





కొలకలూరి స్వరూపరాణి

# ప్రజాస్వామ్య పడవ పైలం

సంపాదించబోయేటాస్తికి రాసేసిన వీలునామా ఐతాన్నది
బచావత్ అవార్డ్ తీర్పు
ఆంధ్రాకు మస్తు హక్కులిచ్చిన్రుగని
మిగులు నీల్లు ఎక్కడా కండ్ల బడ్తలేదు
పెయిలబొక్కలు యెలిబారి శవాల తీర్గ తిరుగాడే
రైతుకూలీ గాల్లతోని బొందలగడ్డోలె
పరేషానైన బూములల్ల వ్యగుసాయం కూలీ పన్లకి
జరంత వసంతం అసోంటిదే ప్రాజెక్టులు
అవుమల్ల- మద్దెన అనుమతి దొకలొల్లి
పర్యావరణం బగ్గె పట్టుగున్నది
గిప్పుడు ఆకలికడ్పుల మోగే సావుమేళంల
గట్క మాట అటుంచి
ప్రజాధనం కోసం ఖాళీ జేసుడు పైసలతో
ప్రాజెక్టులు గట్టుడు చూస్తే
మబ్బుల్ల నీల్లు జూసి ముంత వొలక బోసుకున్నట్లు
గోదావరి నీళ్ళల గీటు గీసుడు కోసం



కల్లోలిత జిల్లాలగాయి
నైజాం కాలం నుంచి బాంచె బత్కుముస్కిల్ పిలగాండ్ల
ప్రాంతీయత న్యాయమైన సోంటిదే
గని.... ఆంధ్రోల్ల యింటిగుట్టు గాల్లకు సుతాతెల్వది
ఎత్తి పోతల యిజ్జత్ జండ యెత్తలేదని ఉత్తరాంధ్రది ఆగం
మబ్బులతో ములాఖాత్ అయ్యే ముంపుముప్పు నాదుతోని
పొట్కుదిని దిమక్ ఖరాబైతాన్న దక్షిణాంధ్రదొక గోస
విరాట పర్వం నిత్యపారాయణమైనా పూలుపుట్కల వడ్తలేని
గా రాయలసీమతోని
గీ మూడు లింగాల నడుంగుల రాష్ట్రమైన "త్రయిణి"
కూలీ నాలీగాల్ల బత్కుయెత మూటికీ ముద్రేసుకుని
ఓట్లు గల్లంతైనా ఒకే బండిల పయనం
సారా - చీరల - లలన జేస్కుంతో
వ్యవస్థను
మస్తూ భద్రంగా కొంచబోతున్న
కాలం నదిల
ప్రజాస్వామ్య పడవ పైలం





కొలకలూరి స్వరూపరాణి

# అద్దదీ సారాశంబు

ఊకోండ్రీ
మాండలికం మీ గడ్డకే మిరాశీయని
ఎవరు ఖరారు పత్రం రాసిన్రు?
గది చెమట సముద్రంల
పుట్టుకచ్చిన ఆణిముత్యం
చిన్నయ సూరి చేతులకు చిరతలిచ్చి
కాయకష్టం బాటమీన
బత్కు బండిని నడిపెటోళ్ళు
మండలాలవారీగా అర్సుకున్న ఖజాణా
రాయలసీమల "నిగా"
సర్కారుల "నిఘా"
తెలంగాణాలో "నిగరానీ"
ఒకటీ అరా అచ్చులు అటూ ఇటుగా
పోవడి అంతా ఒకే బడినుంచి
దుసి పడిందన్నట్లు గాదె?



సమేకమో వేర్పాటో నాకు తెల్వది
తేనె తేట మాండలికం తల్లి వేరుగా
కొమ్మలూ రెమ్మలుగా ఎదిగింది భాషావృక్షం
ఇప్పుడు తల్లివేరని యెట్ల జెప్తవ్ మల్ల
గా ప్రతాపరుద్రీయంల
రేవేలిన అయ్యయాదికొస్తుండు
శ్రమకు సోటు జేసిన బాన మాండలికం
అన్ని ప్రాంతాలకూ శ్రమ సామాన్యం
మీరు విడిపోయినా అందరం తెలుగుతల్లి బిడ్డలం
అద్దదీ సారాశంబు





డా. గరికిపాటి నరసింహారావు

# జై ఆంధ్రా ! జై తెలంగాణా!

విడదీయుటయె లేదు వేయేండ్ల పద్య సు
గంధమ్ము నన్నయ్య బంధుమిపుడు

పంచియిచ్చుట లేదు పశుల కాపరికైన
పాడనేర్పిన మన భాగవతము

పగులగొట్టుట లేదు భండనమ్మున భద్ర
కాళిక రుద్రమ్మ కత్తి, డాలు

పాయ చీల్చుట లేదు బంగారు తోటలో
ఘంటసాలగ సాగు గాన ఝరిని

ప్రాంతములు వేరుపడినను చింత లేదు
స్వాంతములు వేరుపడకున్న చాలునదియె
తెలుగు విడిపోదు, చెడిపోదు తెలుగు వెలుగు
రెండు కన్నులతో ఇక నుండి వెలుగు







దేశరాజు

# విడిది

అనుకోలేదబ్బా...
ఇలా ఇక్కడికే వస్తానని
ఆకలేసినప్పుడు కడుపు చేతబట్టుకుని...
కడుపు నిండినప్పుడు
అవకాశాన్ని అందిపుచ్చుకునీ...
ఇలా... ఇక్కడే గిరికీలు కొడుతూండి వుంటా!

వీలైతే కాళ్లు జాపుకునీ
లేనప్పుడు మడిచి కడుపులో దాచుకుని,
ఇక్కడే బతుకుపోరులో పారాడా!

పబ్లిగ్గా చెమటనీ, ఏకాంతంగా కన్నీటినీ
చిందించి గుండె బరువును దించుకున్నది...
ఈ నేల మీదే!

రూపాయలను కంటిపాపల్లా కాపాడుకున్నా
కంట్లో శుక్లాలొచ్చి తెల్లారేసరికి
అంతా కృష్ణపక్షమయ్యే జీతపు రాళ్ల తూకంలో
ఎన్ని కొలువులు మారినా–
ఎందుకనో... ఇక్కడే కొట్టుమిట్టాడుతున్నా!

ఏకాంతంలో ఆకాశాన్ని స్కేలుతో కొలుస్తూ
జంటగా విహంగయానం చేస్తూ
కొన్నెత్తుటి పుష్పానికి చివురునైనా
ఈ నేల మీదే ఒత్తిగిల్లా!

తల్లి ఒడిలో తల దూర్చినట్టు....
ప్రియురాలి పెదవుల మధ్య స్వాంతన పొందినట్టు...
ఎందుకో తెలీదు –
ఇక్కడి గాలీ, నా కాళ్ల కింది నేలా...
పూర్తిగా నావేననిపించాయి!

ఇన్నినాళ్ల తర్వాత...
ఆశలూ, ఆకాంక్షలూ...
ప్రజ్వరిల్లిన ఆక్రోశాల మధ్య,
మళ్లీమళ్లీ తూచ్ అంటున్న రాజకీయాల మధ్య,
మోసపోతూ... మోసపోతూ...
ప్రాణాలను పిడికిళ్లతో పిండేసుకుంటున్న
ఉద్యమోద్రిక్తతల మధ్య,
ఒకే ఒక ప్రశ్న–
నింగీ నేలా నీరు గాలీ
నిజంగా నీవేనా?
తొలిచేస్తోంది!

కొమ్మ ఎంత అందమైనదైనా
నీరు ఎంత స్వచ్ఛంగా వున్నా
నగర హృదయపు ఔదార్యం ఎంత గొప్పదైనా
అనుబంధం ఎంతగా పెనవేసుకున్నా
అతిథికి ఎప్పుడూ...
విడిది సొంతం కాదు!







కోయి కోటేశ్వరరావు

## పూల సింగిడి

వీర తెలగాణ శౌర్యంపు వీధులందు
పసిడి సింగిడీలతొ ముగ్గు పరచినట్లు
పూల జాబిలి తీరుగ నేలమీద
పరిమళించు 'బత్కమ్మ'ను ప్రస్తుతింతు

చినుకు ముద్దులతో నింగి చెలిమి మీర
కలికి పుడమిని మనసార కౌగిలింప
పులకరింతలు తనువంత మొలకలెత్తె
నిలలొ బతుకమ్మ గనదియె కొలువుతీరె

కట్లపూల రవిక ఘనముగా ధరియించి
బీర పూల వన్నె చీర గట్టి --
తంగెడు కుసుమాలు తలనిండుగ తురిమి
తరలి ర! బతుకమ్మ! సిరులు కురువ !

వేన వేల తారల సమావేశమట్లు
సీత కోకచిలుకల కచేరి యట్లు

వాసి గాంచు ప్రకృతి దరహాసమట్లు
కనుల విందుగ బతుకమ్మ తనరుచుండు

చిట్టి చార్మినారులు చేత బట్టి నటుల -
కాంతలు బతుకమ్మలతోడ కదలి రాగ,
పూల కదలియై నిరతము ప్పొంగు నేల
అలల పరిమళాల్ హృదయాల నంటుకొనగ

పుడమి సౌందర్యమును రాశి పోసినట్లు
పడుచు కోయిలల్ పాటలు పాడునపుడు
తేనె సెలయేరు ప్రవహించు, వీనులందు
ఉల్లమానంద డోలికలూగుచుండు

వలస దోపిడీ తత్వమ్మునిలను తరిమి
కోటి రత్నాల వీణను మీటి, నేడు
జీవన విముక్తి గీతాల్వచింపుమమ్మ!
ప్రజల బంగారు కలలన్ని పండునట్లు

నాయకత్వ మాయ వ్యసనాన్ని వీడి
మా తెలంగాణ సోదర నేతలంత
రాష్ట్ర సిద్ధికై కలసి పోరాడు నటుల
మేలు సమకూర్చవమ్మా! వరాల తల్లి!

ఘన ప్రపంచీకరణ సునామినెదిరించి
సంప్రదాయము చేసిన సంతకముగ
స్వచ్ఛమౌ తెలంగాణ సంస్కృతికి సతము
సుందర చిరునామగ, వెలుగొందుమమ్మ









# తలాక్

**ఆలు - మగల్లా విడిపోదాం -**
**అన్నదమ్ముల్లా కలిసుందాం**

మాసూం తెలంగాణ కే నర్ఖర్ ఆంధ్ర మే మిలాయ జా రహాహై. హం సమస్తే కీ యహా మిలాహ్ అచ్చా చలేంగా.. అచ్చా చలేగా. ఠీక్ హై. వర్నా జబ్ చాహే **తలాక్** లే సక్తాహై

***- జవహర్‌లాల్ నెహ్రూ***

ప్రపంచంలో ఏ రెండు ప్రాంతాల మధ్యనైనా సోదరభావం ఉంటుంది. అదే ఒక ప్రాంతం నుండి ఇంకొక ప్రాంతం విడిపోయినా, కలిసినా దాయాదులుగానే చెప్పుకుంటాం. కానీ విచిత్రంగా ఒక తెలంగాణ ఆంధ్ర విషయంలోనే భార్యా, భర్తల సంబంధంగా గుర్తింపుకొచ్చింది.

## "తెలంగాణ" దిల్ వాలోం కా...

*ప్రియమైన మిత్రులారా!*

మన "తెలంగాణ రాష్ట్రం" భాషా ప్రయుక్త కుట్ర - విశాలాంధ్ర ద్రోహాలతో ఆంధ్రప్రదేశ్‌లో విలీనం అయినప్పటి నుండి తెలంగాణ ప్రజలమైన మనం నర్ఖర్ (ఆంధ్ర వలస పాలకుల) దృతరాష్ట్ర బిగి కౌగిలిలో ఉక్కిరి బిక్కిరి అవుతూనే వున్నాము. మన జవసత్వాలు కోల్పోతూనే వున్నాము. ఆనాటి నుండీ ఉద్యమిస్తూనే వున్నాము. ఇప్పుడు మన పెనుగులాట చివరాఖరికి వచ్చింది. మనం మళ్ళీ మన తెలంగాణ రాష్ట్రం కావాలంటూ చేస్తున్న ఉద్యమానికి అటు ఆంధ్ర, రాయలసీమ ప్రాంత ప్రజలు కూడా మద్దతు తెలియజేస్తున్నారు. గత ఎన్నికల్లో కాంగ్రెస్ ప్రత్యేకంగా తెలంగాణ కోసం ఏర్పడిన తెలంగాణ రాష్ట్ర సమితితో జతకట్టి, మమ్మల్ని గెలిపిస్తే తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేస్తామని ప్రకటించి, ఎన్నికల్లో నిలిచింది. కాంగ్రెస్ పార్టీ గెలిస్తే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు చేస్తుందని తెలంగాణ ప్రజలు ఎట్లా ఓటు వేసి గెలిపించారో, తమ ప్రాంతం నుండి తెలంగాణాను విడదీస్తారని తెలిసినా, కాంగ్రెస్ నే గెలిపించారు ఆంధ్ర, రాయలసీమ ప్రజలు. ఇప్పుడు కూడా ఆంధ్రప్రదేశ్ అంతా కాంగ్రెస్ పార్టీ అధ్యక్షురాలు సోనియాగాంధీ రేపు రాబోయే ఎన్నికలలోపు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును ప్రకటిస్తుందని విస్తృతంగా ప్రచారం జరుగుతున్న సమయంలో ఆమెకు నిరసన, వ్యతిరేకత తెలుపక పోగా, ముద్దులు కూడా పెడుతున్నారు ఆంధ్ర, రాయలసీమ ప్రజలు. అంటే తెలంగాణా రాష్ట్రం ఏర్పడడం అనివార్యమని, అది ఇవ్వడమే

న్యాయమని, అడగడమే ధర్మమని ఆ ప్రాంత ప్రజలు చెప్పకనే చెపుతున్నారు. ఆ భావనలో భాగంగానే తెలంగాణ రాష్ట్రం కోసం మన నేల మీద మనం చేస్తున్న ఉద్యమానికి మద్దతుగా మేము కూడా సంఘీభావం చెబుతున్నామంటూ, ఎంతోమంది ఆంధ్ర, రాయలసీమ బుద్ధిజీవులు గొంతులు విప్పుతున్నారు. తెలంగాణకు సై అనే ఎవరైనా మనవాళ్లే. తెలంగాణ నై అనే వాళ్లెవరైనా బద్మాష్‌గాళ్ళే. సమైఖ్యాంధ్ర, విశాలాంధ్ర అనే బుద్ధిహీనులకు మన ఆంధ్ర, రాయలసీమ మిత్రులతో బుద్ధులు చెప్పిద్దాం.

బతుకుదెరువు కోసం పొట్టచేత పట్టుకొని వచ్చిన ఎవరైనా మాది తెలంగాణే – మేమూ తెలంగాణే అంటే అలాయి, బలాయి చెబుదాం. మేమే తెలంగాణ అంటే మాత్రం అరికాలిమంట నెత్తికెక్కుతుంది. చెప్పు చేతికొస్తుంది, చెంప చెల్లుమంటుంది.

నిజాం పాలన అనే పెనం మీద నుంచి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పాలన అనే పొయ్యిలోకి పడిన నవంబర్ ఒకటిన నల్లగొండ జిల్లా, హాలియా లో తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షను బలపరుస్తూ, మద్దతు తెలియజేస్తూ, సంఘీభావం ప్రకటిస్తూ, తెలంగాణాకు సై అంటున్న వాళ్ళకు మనం జైజై అందాం.

## సీమాంధ్రుల తెలం'గానం' బహిరంగ సభ

**హాలియా, నవంబర్ ఒకటి, గురువారం సా॥ 5.00 గంటలకు (1.11.2007)**

**తెలంగాణాకు జై అంటున్న ఆంధ్ర, రాయలసీమ గొంతుకలు**

**కాకరాల, త్రిపురనేని మహారది, హరిబాబు, మల్లెల వెంకట్రావు, కృపాకర్ మాదిగ, కె. శివారెడ్డి, శిఖామణి, వై.యస్. కృష్ణేశ్వరరావు, కోయి కోటేశ్వరరావు, జె. గౌతమ్, చిత్తూరు శ్రీను, ఖాదర్ మొయినొద్దీన్, ఎ.కె. ప్రభాకర్, పులిగుజ్జు సురేష్, కృష్ణ, మాధవి, దేవకుమారి, సజయ, సరస్వతి, సుధ, కాత్యాయని, చైతన్య, వినోదిని.**

**మరియు దప్పు రమేష్, అజయ్ బృందాలచే సాంస్కృతిక కార్యక్రమాలు**



తెలంగాణ అడగటమే – న్యాయం
తెలంగాణ ఇవ్వడమే – ధర్మం
గల్లీ గల్లీమే నారా హై! తెలంగాణా హమారా హై"
మా గానం తెలం గానం
మా ప్రాణం తెలంగాణం

జై తెలంగాణ తల్లి ! జై ఆంధ్రమాత !! జై రాయలసీమమ్మ !!!

వేనేపల్లి పాండురంగారావు : **తెలంగాణ మట్టి మనుషులు** - తేది :1.10.2007



*జయహే తెలంగాణా !* *జయ జయహే తెలంగాణ !!*



# సీమాంధ్రుల తెలంగానం

**అన్నదమ్ముల్లా విడిపోదాం – ఆత్మీయుల్లా కలిసుందాం**

**ద్వేషించే కూటమిలోన నిలచి – ప్రేమించే మనిషే కదా మనిషి**
**– శ్రీశ్రీ**

*ప్రియమైన తెలంగాణ ప్రజల్లారా ! సీమ – ఆంధ్ర వలస ప్రజల్లారా!!*

మనం, మళ్లీ మన తెలంగాణ రాష్ట్రం కోసం గత 50 ఏళ్ళుగా ఎదురుచూస్తూనే వున్నాం. పోరాడుతూనే వున్నాం. మన ఉద్యమాల ఫలితంగా మన చిరకాల వాంఛ తెలంగాణ రాష్ట్రం ఏర్పడటం తథ్యం అని భావిస్తున్న తరుణంలో కొంతమంది అటు ఆంధ్ర నాయకులు, ఇటు తెలంగాణ ద్రోహులు కలిసి గందరగోళ పరిస్థితులు సృష్టిస్తూ, తెలంగాణ ఏర్పడటం కష్టసాధ్యమనే ఒక నిరాశపూరిత వాతావరణం కల్పిస్తున్నారు. దీనిని మనము బద్దలు కొట్టడానికి మనం ఎంతో అప్రమత్తతతో వుండటమే కాకుండా మనతో మమేకమయ్యే శక్తులతో, మనతో కలిసి వచ్చే వ్యక్తులతో కలిసి, మన తెలంగాణాను మళ్ళీ రాష్ట్రంగా తెచ్చుకోవాల్సిన అవసరం ఉంది. దీనికోసం మనతో గొంతు కలుపుతూ, తెలంగాణ రాష్ట్రంగా ఏర్పడటం అవసరం, అనివార్యం అది ఒక ప్రజాస్వామికమైన హక్కు అని గుర్తించి, ఆ విషయాన్ని మన తెలంగాణ గడ్డమీద ఎలుగెత్తి చాటటానికి వస్తున్న సీమ–ఆంధ్ర మిత్రులకు స్వాగతం పలుకుతూ, వారి సంఘీభావానికి కృతజ్ఞతలు తెలుపుతూ, వారు చెప్పే విషయాల్ని ప్రజల్లోకి తీసుకువెళుతూ, సమైక్యాంధ్ర, విశాలాంధ్ర అంటూ తెలంగాణా నేలమీద నిలిచి వలస గానం చేస్తున్న, తెలంగాణా తల్లిపాలు తాగి రొమ్ము గుద్దుతున్న నాయకులకు బుద్ధి చెబుదాం.

నవంబర్ ఒకటి 2007 సాయంత్రం 5.00 గంటల నుండి నల్లగొండ జిల్లా, హాలియాలో వాళ్ళు (సీమాంధ్రులు) ఆలపిస్తున్న తెలంగానం విందాం రండి.

## సీమాంధ్రుల తెలం'గానం' బహిరంగ సభ

**హాలియా, నవంబర్ ఒకటి, గురువారం సా॥ 5.00 గంటలకు (1.11.2007)**